శ్రీరస్తు

# శ్రీరామకర్ణామృతము



శ్రీ చేకూరి - సిద్ధకవి కృతపద్యములతోను,

బ్రహ్మశ్రీ

పండిత, పురాణం-సూర్యనారాయణతీర్థులచే వ్రాయఁబడిన

సమకూర్పఁబడినది.

ఇది

శ్రీ తీర్థులవారిచే సంస్కరించి

పరిశోధింపఁబడినది.

---

ఈ కూర్పు

ప్రకాశకులు :

రామా అండ్ కో.,

పబ్లిషర్సు - ఏలూరు.

286, ఎస్ప్లనేడు,

మదరాసు.

 [వెల 1-8-0.

౪ వ యాశ్వాసములోని ౪౫. వ శ్లోకము శ్రీబుధకౌశికవిరచితమయిన శ్రీరామరక్షా స్తోత్రములోనున్నది. ౩ వ యాశ్వాసములోని ౧౦౫. వ శ్లోకము శ్రీమద్రామాయణము యుద్ధకాండములోనిది. ౪ వ యాశ్వాసములోని ౭౦ మొదలుకొని ౭౩ వ శ్లో. వఱకును, గల రామప్రాతస్స్మరణశ్లోకములును, ౫౭ వది మొదలు ౬౩ వఱకునుగల శ్లోకములును వేఱువేఱుకవులచే రచింపఁబడినవిగాఁ దెలిసికొనవచ్చును. ఇదిగాక యింకను కొన్నిశ్లోకము లితరులగ్రంథములలోని వని చదువఁగాఁ దెలియవచ్చు చున్నవి. ఏమయినను ఈ గ్రంథమంతయు శ్రీయాదిశంకరులు రచించినది గాకున్న మాఁ కెంగానిమ్ము మొత్తమైనను ఒక్కరిచే రచింపఁబడినదిమాత్రము గా దని పైనిచూపఁబడిన ప్రమాణములవలనఁ దెలియఁదగును.

ఏమయినను, ఈ గ్రంథము శ్రీకృష్ణకర్ణామృతము రచింపఁబడినట్లుగానే శ్రీరామభక్తుఁ డయిన యొకకవి తాను కొన్నిశ్లోకములు రచియించి కొన్నింటిని ఇతరులగ్రంథములనుండి గ్రహించియు నీగ్రంథమును సమకూర్చియున్నాఁ డనుట ఏవిధ మయినసంశయమును లేదు. ఇది శ్రీరామభక్తుల కెంతేని సంతోషమును కలిగించు గ్రంథ మనుటతప్పదు. దీని నిదివఱలోఁ గొందఱు ముద్రించియున్నారు. పరిష్కృత పుస్తకగ్రంథపరిశోధకులగు మ. రా. శ్రీ, ఏ కణ్ణాచెట్టిగారు సంస్కృతశ్లోకములకుఁ దాత్పర్యమును వ్రాసియిమ్మని నన్నుఁగోరుటచే యథామతి వ్రాసియిచ్చితిని. మునుపటిముద్రణములలోని తప్పుల కొన్నింటిని దిద్దియున్నాఁడను. ఇంకను కొన్ని యుండవచ్చును. శుద్ధమైనప్రత్యంతరము లభింపనికారణమున వని దిద్దఁజాలనిమాలోపమును మన్నింపవేఁడుచున్నాను. ఇదివఱలో ముద్రితములయిన పుస్తకములకన్న నిది యెన్నోరెట్లు మిన్న యని చదువరు లెఱుంగఁగల రని విన్నవించుచున్నాను.

సీ. నీలమేఘమ్ముపైని వసించుమించు నా వామాంకమున సీత వఱలుచుండ
భరతశత్రుఘ్నులు పార్శ్వద్వయమ్ములను నిల్చి వింజామరలు పూని విసరుచుండ
చరమభాగమున లక్ష్మణుఁడు శ్వేతాతపత్రమ్ము నిమ్ముగాఁ బట్టుచుండ
తత్త్వమ్ము వినుచు నుత్తముఁడౌ మారుతసుతుండు భక్తితోఁ బాదమ్ము లొత్తుచుండ
తే. ఎదుటఁ గూర్చున్నకపిసేన మొదలుగల్గు, వార లందఱు సంబరపడఁగ శాంత
రసము వర్షించుచున్న శ్రీరామచంద్ర!, ప్రీతి మాకృతు లంగీకరింపుమన్న!

1-2-29 }
చెన్నపట్టనము }

భగవద్భాగవతవిధేయుఁడు
పురాణం సూర్యనారాయణతీర్థులు.

శ్రీరస్తు.

శ్రీరామచంద్రపరబ్రహ్మణే నమః.



# శ్రీ రామకర్ణామృతము.

—◆◆◆—

## మంగళశ్లోకములు.

శ్లో. మంగళం భగవాన్ విష్ణు ర్మంగళం మధుసూదనః
మంగళం పుండరీకాక్షో మంగళం గరుడధ్వజః

శా. శ్రీరామున్ భువనాభిరాము ఘనగా♦జీవాప్తధాముం బరం
ధాముం బావననాముఁ బాలితమునీం♦ద్రస్తోము నీలాంబుద
శ్యామున్ సన్నుతసోము భానుకులదు♦గ్ధాంభోధిసోమున్ మహో
ద్దామప్రాభవదైత్యభీము నతసు♦త్రామున్ మదిం గొల్చెదన్.

—◆◆◆—

శ్లో. మంగళం కోసలేంద్రాయ మహనీయగుణాబ్ధయే,
చక్రవర్తితనూజాయ సార్వభౌమాయ మంగళమ్.
వేదవేదాంతవేద్యాయ మేఘశ్యామలమూర్తయే,
పుంసాం మోహనరూపాయ పుణ్యశ్లోకాయ మంగళమ్. ౧

చ. ప్రకటితకోసలేంద్రునకు ♦ భవ్యగుణాబ్ధికిఁ జక్రవర్తిపు
త్రకునకు సార్వభౌమునకు ♦ రామునకున్ నిగమాంతవేదికిన్
సకమలమేఘవర్ణునకు ♦ సర్వజగజ్జనమోహనస్వరూ
పకునకుఁ బుణ్యకీర్తికిఁ గృ♦పానిధి కెప్పుడు భద్ర మయ్యెడున్.

తా. ఉత్తర కోసలదేశములకుఁ బ్రభువును, పూజింపఁదగిన గుణములకు సముద్రుఁడును, దశరథచక్రవర్తికుమారుఁడును, సర్వభూమండలమునకును ఈశ్వరుఁడును, వేదవేదాంతములచేఁ దెలియఁదగినవాఁడును, లోకములకెల్ల నల్లనైన శరీరముకలవాఁడును, పురుషులకుసయితము మోహము గలిగించు రూపముగలవాఁడును, పవిత్రముయిన కీర్తిగలవాఁడును అగురామునకు శుభము.

శ్లో. విశ్వామిత్రాంతరంగాయ మిథిలానగరీపతేః,
భాగ్యానాం పరిపాకాయ భవ్యరూపాయ మంగళమ్.
పితృభక్తాయ సతతం భ్రాతృభి స్సహ సీతయా,
నందితాఖిలలోకాయ రామచంద్రాయ మంగళమ్. ౨

చ. ప్రకటవిదేహభాగ్యపరి♦పాకునకున్ ముదితాంతరంగకౌ
శికునకుఁ బితృభక్తునకు ♦ శీలికి భూమిసుతాసుమిత్రపు
త్రకసహితప్రకాశునకుఁ ♦ బ్రస్తుతసాధుజనైకభవ్యమూ
ర్తికి రఘురామచంద్రునక♦రిస్ఫుటపాణికి భద్రమయ్యెడున్.

తా. విశ్వామిత్రుని కంతరంగస్వరూపుఁడును, మిథిలానగరప్రభువైన జనకుని యదృష్టముల పరిపాక స్వరూపుఁడును, మంచి రూపముగలవాఁడును, పితృభక్తుఁడును, ఎప్పుడును సోదరులతోను, సీతతోను గూడియుండి యెల్లలోకములను ఆనందింపఁజేయువాఁడును అగు రామచంద్రునకు శుభము.

శ్లో. త్యక్తసాకేతవాసాయ చిత్రకూటవిహారిణే,
సేవ్యాయ సర్వయమినాం ధీరోదాత్తాయ మంగళమ్.
సౌమిత్రిణా చ జానక్యా చాపబాణాసిధారిణే,
సంసేవ్యాయ సదా భక్త్యా సానుజాయాஉస్తు మంగళమ్. 3

ఉ. పౌరి కయోధ్యసౌఖ్యపరి♦హారికి సంచితచిత్రకూటసం
చారి కుదారికిన్ వినుత♦సంయమికిన్ శరచాపధారికిన్
క్ష్మారమణీజలక్ష్మణస♦మన్వితమూర్తికి భవ్యకీర్తికిన్
శ్రీరఘురామచంద్రునకు ♦ సేవకసేవధికిన్ శుభం బగున్.

తా. అయోధ్యావాసము విడిచినవాఁడును, చిత్రకూటమున విహరించినవాఁడును, మునులందఱకును సేవింపఁదగినవాఁడును, ధీరోదాత్తనాయకుఁడును, ధనుర్బాణములను, కత్తిని ధరించువాఁడును, ఎప్పుడును జానకీలక్ష్మణులచే భక్తిపూర్వకముగా సేవింపఁదగువాఁడును సోదరులతోఁ గూడియుండువాఁడును అగు రామునకు శుభము.

శ్లో. దండకారణ్యవాసాయ ఖండితామరశత్రవే,
గృధ్రరాజాయ భక్తాయ ముక్తిదాయాஉస్తు మంగళమ్.

సాదరం శబరీదత్తఫలమూలాభిలాషిణే,
సౌలభ్యపరిపూర్ణాయ సత్త్వోద్రిక్తాయ మంగళమ్. ౪

మ. అరివిధ్వంసిని దండకావనవిహా ♦ రారామాదినిన్ గృధ్రశే
ఖరనిశ్శ్రేయసదాయినిన్ శబరిసా ♦ కాంతాపూర్వికారణ్యమా
ధురిశోధ్యత్ఫలభోక్తృకం బ్రవిలస ♦ ద్దోస్సారినిన్ శౌరినిన్
స్వరసౌలభ్యగుణప్రపూర్ణునకు నా ♦ నాభద్రముల్ చేకురున్.

తా. దండకారణ్యములో నివసించినవాఁడును, దేవవిరోధులగు రాక్షసులను చంపినవాఁడును, భక్తుఁడగు జటాయువునకు మోక్షమిచ్చినవాఁడును, అపూర్వముగ శబరియిచ్చిన ఫలమూలాదులం దభిలాషగలవాఁడును, భక్తసులభుఁడును, అంతటను నిండినవాఁడును, సత్త్వగుణప్రధానుఁడును అగు రామునకు శుభము.

శ్లో. హనూమత్సమవేతాయ హరీశాభీష్టదాయినే,
వాలిప్రమథనాయాస్తు మహాధీరాయ మంగళమ్.
శ్రీమతే రఘువీరాయ సేతూల్లంఘితసింధవే,
జితరాక్షసరాజాయ రణధీరాయ మంగళమ్. ౫

ఉ. పాలితవాయుసూనునకు ♦ భక్తకపిప్రవరేష్టదాయికిన్
వాలివిదారికిన్ ధృతికి ♦ వారిధిసేతునిబంధనక్రియా
శాలికి వీరరామునకుఁ ♦ జండపరాక్రమపంక్తికంఠని
ర్మూలనకేళికిన్ నృపతి ♦ ముఖ్యులలామునకున్ శుభం బగున్.

తా. ఆంజనేయునితోఁ గలిసికొన్నవాఁడును, శ్రేష్ఠుఁడగు రాజైన సుగ్రీవుని యిష్టమును సమకూర్చినవాఁడును, వాలిని మథించినవాఁడును, మహాధీరుఁడును, శ్రీమంతుఁడును, సేతుమార్గమున సముద్రమును దాఁటినవాఁడును, రావణుని చంపినవాఁడును, రణరంగమునందు ధైర్యముగలవాఁడును, శ్రీమంతుఁడును అగు రామునకు శుభము.

శ్లో. ఆసాద్య నగరీం దివ్యా మభిషిక్తాయ సీతయా,
రాజాధిరాజరాజాయ రామభద్రాయ మంగళమ్.
విభీషణకృతే ప్రీత్యా విశ్వాభీష్టప్రదాయినే,
జానకీప్రాణనాథాయ సదా రామాయ మంగళమ్. ౬

మ. ప్రకటారామాధ్యపురిన్ ధరాతనయతోఁ ♦ బ్రాపించి రాజాధినా
యకసంస్తుత్యధరాభిషేకము నిజం ♦ బై యున్నలోకాధినా

భూరుహామిత్రు దీర్ఘకరుఁ బుణ్యచరిత్రు జగత్పవిత్రు శృం
గారగుణాభిరాముఁ ద్రిజగత్ప్రభు నంతు హృదంతరంబునన్.

తా. శ్రీమంతమైనట్టి రఘువంశములోఁ బుట్టినవాఁడును, దశరథుని కుమారుఁడును, ఏప్రమాణములకును విషయము గానివాఁడును, సీతకు పెనిమిటియైనవాఁడును, రఘువంశమునకు రత్నదీపమువంటివాఁడును, కోదండముట్టు చేతులుగలవాఁడును, తామరరేకులవంటి పెద్దకన్నులుగలవాఁడును, రాక్షసులను ఖండించినవాఁడును అగు రామునకు నమస్కరించుచున్నాను.

శ్లో. శ్రీరామం బలవైరినీలరుచిరం స్మేరాననం శ్యామలం
కర్ణాంతాయతలోచనం సురవరం కారుణ్యవారాంనిధిమ్,
శోణాంభోరుహపాదపల్లవయుగం క్షోణీతనూజాయుతం
రాజత్కుండలగండభాగయుగళం రామం సదాఽహం భజే. ౩

మ. హరినీలాలకు సుస్మితాననుఁ ఘనశ్యామాంగు దవళు సుం
దరకర్ణాంతవిలోచనున్ రఘువరున్ ధాత్రీతనూజాధిపున్
గరుణాంభోనిధి రత్నకుండలలసద్గండస్థలున్ సవ్యభా-
సురతామ్రాంబుజపల్లవాంఘ్రి యుగు సుశ్లోకున్ బ్రశంసించెదన్.

తా. ఇంద్రనీలములవంటి జుట్టుగలవాఁడును, చి గముగలవాఁడును, నల్లనివాఁడును, చెవులవఱకును వ్యాపించిన కన్నులుగలవాఁడును, దేవతలలో శ్రేష్ఠుఁడును, దయాసముద్రుఁడును, ఎఱ్ఱదామరలవంటిపాదములుగలవాఁడును, సీతతోఁ గూడినవాఁడును, కుండలములచేఁ బ్రకాశించుచెక్కులుగలవాఁడును అగు శ్రీరాముని సదా సేవించుచుందును.

శ్లో. శ్రీరామం జగదేకవీరమమలం సీతామనోరంజనం
కౌసల్యావరనందనం రఘుపతిం కాకుత్స్థవంశోద్భవమ్,
లోకానామభిరామమంగళకరవ్యాపారపారాయణం
వందేఽహం జనఘోరపాపనికరధ్వంసం విభుం రాఘవమ్. ౪

శా. శ్రీరాముం జగదేకవీరు నమలున్ సీతామనోరంజనున్
గారుణ్యాకరుఁ గోసలేశ్వరసుతాగర్భాబ్ధిచంద్రోదయున్
ఘోరాఘౌఘతమిస్రకంజసఖుఁ గాకుత్స్థాన్వయున్ రాఘవున్
శూ లోకపవిత్రు రామవిభు సుశ్లోకున్ మదిన్ గొల్చెదన్

తా. లోకములలో ఏకవీరుఁడును, నిర్మలుఁడును, సీతమనస్సును రంజింపఁజేయువాఁడును, కౌసల్యకుమారుఁడును, రఘువంశప్రభువును, కాకుత్స్థ వంశమునఁ బుట్టినవాఁడును, లోకముల కిష్టమైన మంగళములను గలిగించు వ్యాపారమునం దాసక్తిగలవాఁడును, భక్తులభూరపాపములను బోఁగొట్టువాఁడును, సర్వవ్యాపకుఁడును అగు రామునికి నమస్కరించుచుందును.

శ్లో. శ్రీరామం జగదీశ్వరం జనకజాజానిం జనానందనం
జంతూనాం జనకం జనార్తిహరణం లోకేశ్వరం శాశ్వతమ్,
జాబాల్యాదిమునీశ్వరైః పరివృతం జాజ్వల్యమానం సదా
జంభాలం జమదగ్నిసూనుహరణం జాతానుకంపం భజే. ౫

శా. శ్రీరాముఁ జగదీశ్వరున్ జనకపుత్రీనాథు మానీంద్రసం
భూరూఢావృతు సజ్జనార్తిహరు జంభూలున్ బరీభావకృ
ద్భూరిప్రాభవభార్గవున్ సకలజంతుప్రాణరక్షున్ సువ
ర్వారాధ్యున్ రఘువర్యు శాశ్వతుజనాహ్లాదున్ భజింతున్ మదిన్.

తా. జగదీశ్వరుఁడును, సీతాపతియు, జనుల నానందపఱచువాఁడును, సర్వభూతములను తండ్రియును, జనులబాధలను తొలఁగించువాఁడును, లోకనాయకుఁడును, శాశ్వతుఁడును, జాబాలి మొదలైన మునులచేఁ జుట్టుకొనఁబడువాఁడును, మిగులఁ బ్రకాశించువాఁడును, అతివేగముగలవాఁడును, పరశురాముని తేజమును హరించినవాఁడును, దయాళుఁడును అగు శ్రీరాముని సేవింతును.

శ్లో. శ్రీరామో రఘునాయకో రఘువరో రాజీవనేత్రాంచితో
రాజేంద్రో రఘుపుంగవో రఘుకులోత్తంసో రఘూణాం పతిః,
రామో రాక్షసనాశకో౽మితబలో రాకేందుబింబాననో
రాజచ్ఛింజినికంకణాంకితకరో రామ స్సదా పాతు నః. ౬

శా. రాజీవాయతపత్రనేత్రు విలసద్రాకేందుబింబాననున్
రాజేంద్రున్ రఘుపుంగవున్ రఘుకులున్ రాత్రించరారిన్ మహా
తేజున్ రాఘవు నప్రమేయబలసందీప్తున్ రఘూత్తంసునిన్
రాజచ్ఛింజినికంకణాంకితకరున్ రామప్రభున్ గొల్చెదన్.

తా. రఘువంశనాయకుఁడును, రఘువంశశ్రేష్ఠుఁడును, తామరరేకులవంటి కన్నులుగలవాఁడును, రాజేంద్రుఁడును, రఘుపుంగవుఁడును, రఘుకులమునకు శిరోభూషణమువంటివాఁడును, రఘువంశమువారికిఁ బ్రభువును, రాక్షసులను నశింపఁజేసిన

వాఁడును, అపరిమితమయిన బలముఁగలవాఁడును, పున్నమచందమామవంటి మోము గలవాఁడును, ప్రకాశించుచుండు చెవికుండలంబుల కంకణములచే నలంకృతములయిన చేతులుఁగలవాఁడును అగురాముఁడు మమ్మును పాలించుచుండును గాక!

శ్లో. శ్రీరామచంద్ర కరుణాకర రాఘవేంద్ర
రాజేంద్రచంద్ర రఘువంశసముద్రచంద్ర,
సుగ్రీవనేత్రయుగళోత్పలపూర్ణచంద్ర
సీతామనఃకుముదచంద్ర నమో నమస్తే. ౭

చ. మనుకులవార్ధిప్రాగుదిత ♦ మానితపూర్ణిమచంద్రు, సర్వస
జ్జనసుతకీర్తిసాంద్రు, మహి ♦ జానయనోత్పలపూర్ణచంద్రు, శో
భనగుణు రామచంద్రుని వి ♦ భాకరజాక్షియుగాబ్జచంద్రు, స
న్మునినుతు రాఘవేంద్రు భవ ♦ నాథుఁడనుఁ గారుణికుఁ భజించెదన్.

తా. కరుణాకరా! రాఘవేంద్రా! రాజేంద్రచంద్రా! రఘువంశసముద్రచంద్రా! సుగ్రీవుని కన్నులనెడి కలువలకుఁ బున్నమచందురుఁడా! సీతమనస్సనెడి కలువపూవునకుఁ జంద్రునివంటివాఁడవగు శ్రీరామచంద్రా! నీకు నమస్కారము.

శ్లో. శ్రీరామం కరుణాకరం గుణనిధిం సీతాపతిం శాశ్వతం
పారావారగభీర మబ్జనయనం ప్రావృష్ణశ్యామలమ్,
వీరశ్రేష్ఠ మనామయం విజయినం విశ్వప్రశాస్తారకం
ఘోరారిప్రకరాధిదప్రహరణం కోదండరామం భజే. ౮

శా. వీరశ్రేష్ఠు ననామయుఁ జయకరుఁ ♦ విశ్వప్రశాస్తారకుఁ
బారావారగభీరుఁ గంజనయనుఁ ♦ బ్రావృష్ణశ్యాములుఁ
ఘోరారిందము శాశ్వతుఁ రఘువరుఁ ♦ గోదండదీక్షాగురుఁ
శ్రీరాముఁ గరుణాకరుఁ గుణనిధిఁ ♦ సీతేశుఁ బ్రార్థించెదన్.

తా. దయకు గనియును, గుణములకు నిధియును, సీతాపతియును, శాశ్వతుఁడును, సముద్రమువలె గంభీరుఁడును, తామరరేకులవంటి కన్నులుఁగలవాఁడును, వర్షాకాల మేఘమువలె నల్లనివాఁడును, వీరులలో శ్రేష్ఠుఁడును, ఆధ్యాదిరోగములేనివాఁడును, జయశాలియును, ప్రపంచమును ప్రకాశింపఁజేయు స్వరూపముఁగలవాఁడును, భయంకరులయిన శత్రువులసమూహమునకు మనోవ్యాధిని గలిగించు నాయుధములుగల వాఁడును, కోదండరాముఁడును అగు శ్రీరాముని సేవించుచుందును.

శ్లో. శ్రీరామచంద్రేతి సలక్ష్మణేతి నీలోత్పలశ్యామలకోమలేతి,
అక్రోశయుక్తాః స్వధునైవ జానకీసీతాపతే రాఘవ రాఘవేతి. ౯

ఉ. శ్రీరఘురామ రాఘవ విశిష్టపవిత్రచరిత్ర సత్కృ
పారసనాథసింధుమహితా సుమిత్రసుతానుయుక్త ధా
త్రీరమణీసుతాధిప సుధీజనవందితపాదపద్మ శృం
గారనిధీ యటంచుఁ గలకాల మొకో రసనా! స్మరింపుమా.

తా. శ్రీరామచంద్రా అనియును, ఆత్మగుణసహితా అనియును, నల్లగలువరేక వ
ల్లగ మొత్తనైన శరీరముగలవాఁడా అనియును, సీతాపతి, రాఘవా రాఘవా అనియును,
నాకండ్ల్యెంద్రియము ఇప్పుడే మిక్కిలిద్వుచుండునది యగుఁగాక!

శ్లో. శ్రీరామచంద్రరమణాంబుజనేత్ర రమ్యాంగవామవిధివాంబిరామ,
జితారిరామ ప్రణతారిరామ గుణాభిరామ భువనైకరామ. ౧౦

చ. వరసుగుణాభిరాముఁడు ప్రపంచమనోహరుఁ డాపదాటవీ
స్ఫురదనలుండు వైరిజనపుణ్యగతిప్రణతుండు శత్రుబం
ధురవిభవాపహుండు ఘనదోర్బలుఁ డబ్ధిసుతాభిరాముఁ డా
హరి రఘురామదైవతమునందు నిశంబు రమింపు చిత్తమా.

తా. పాపము నశ్వపడుము, లక్ష్మిస్వరూపయగుసీత యెడమభాగమునఁ గలవాఁ
డును, లోకముల ఆపదలను తొలఁగించువాఁడును, శత్రువగు పాటకను జయించిన
వాఁడును, శత్రుస్త్రీలచే నమస్కరింపఁబడినవాఁడును, గుణాభిరాముఁడును, లోక
ములను రమింపఁజేయువాఁడును అగు శ్రీరామునియందే రమించుచుండుము గాక.

శ్లో. శ్రీరామచంద్ర రఘుపుంగవ రాజవర్య
రాజేంద్ర రాజ సురనాయక రాఘవేశ,
రాజాధిరాజ రఘునందన రామభద్ర
దాసోఽహమస్మి భవతశ్శరణాగతోఽస్మి. ౧౧

మ. ధరణీనాథశిరస్స్ఫురన్మకుటరత్నజ్యోతిరాజిత
కరపాదాంబుజపాద్యయుగ్ సకలలోకస్వామి రామప్రభుఁ
బరసుఁ రాఘవు దేవదేవు విబుధస్తవ్యప్రభావుఁ బరా
త్పరు రాజేంద్రు రఘూద్వహుఁ దలఁచితిన్ ధ్యానుండనై యుండఁగన్.

తా. శ్రీరామచంద్రా! రఘుపుంగవా! రాజవర్యా! రాజేంద్రా! రాజా! సుర
నాయకా! రాఘవా! ఈశ్వరా! రాజాధిరాజా! రఘునందనా! రామభద్రా! నేను.
నీకు దాసుడ నయితిని; నిన్ను శరణు పొందితిని.

శ్లో. శ్రీరామం సరసీరుహాక్ష మమలం దూర్వాంకురశ్యామలం
విద్యుత్కోటినిభప్రభాంబరధరం పీతాసనాధిష్ఠితమ్.

వామాంకోపరిసంస్థితాం జనకజాం హస్తేనాలింగ్య తాం ప్రాజ్ఞానాం
తత్త్వం చాపరపాణినా మునిగణాన్ వ్యాఖ్యానయంతం భజే. ౧౨

శా. వామాంకస్థసతిన్ బ్రవేష్టమున భావం బొప్పఁ సంశ్లేషుఁడై
తా మౌనీంద్రుల కొక్కహస్తమునఁ దత్త్వం బేర్పడం బల్కు శ్రీ
రాముం సారసపత్త్రనేత్రు ఘన వీరాఖ్యాసనాధిష్ఠితున్
శ్యామాంగున్ దవనీయచేలుని రఘుస్వామిన్ బ్రశంసించెదన్.

తా. తామరలవంటి కన్నులు గలవాఁడును, నిర్మలుఁడును, దూర్వాంకురముల వలె నల్లనివాఁడును, కోట్లకొలఁది సూర్యులతో సరిగాఁ బ్రకాశించు వస్త్రములను ధరించువాఁడును, వీరాసనమునఁ గూర్చున్నవాఁడును, ఎడమతొడపైని గూర్చున్న సీత సౌదామినీవలెఁ గాఁగిలించుకొని కుడిచేతితో మునీశ్వరులకుఁ దత్త్వము నుపదేశించువాఁడును అగు శ్రీరాముని సేవించుచుండెదను.

శ్లో. శ్రీరామ స్సకలేశ్వరో మమ పితా మాతా చ సీతా మమ
భ్రాతా బ్రహ్మసఖా ప్రభంజనసుతః పత్నీ విరక్తిః ప్రియా,
విశ్వామిత్రవిభీషణాదివశినో మిత్రాణి బోధ స్సుతో
భక్తిశ్శ్రీహరిసంగతా రతిసుఖం వైకుంఠ మస్మత్పదమ్. ౧౩

శా. రామస్వామియె తండ్రి తల్లి యలకో భ్రాతాత సుగ్రీవ వి
శ్వామిత్రాఖ్యవిభీషణాదులు హితుల్ ఫ్ సత్స్వబోధ పుత్రుండు స
ద్భామారత్నము శాంతి మిత్రుఁడు జగత్స్వామిత్రజం దచ్యుత
ప్రేమాసక్తి సుఖంబు మత్పదనహా పెంపొందు వైకుంఠమున్.

తా. అంతటికిని ప్రభువయిన శ్రీరాముఁడు నాకుఁ దండ్రి, సీత నాకుఁ దల్లి. బ్రహ్మసఖుండగు ఆంజనేయుఁడు నాకు సోదరుఁడు. విరక్తి నాకుఁ బ్రియురాలు. విశ్వామిత్రుఁడు విభీషణుఁడు మొదలయిన జితేంద్రియులు నాకు మిత్రులు. బ్రహ్మజ్ఞానము నా కొడుకు. శ్రీహరియగు రామునియందు సక్తమయిన భక్తియే నాకు రతిసుఖము. వైకుంఠమే నా పొందఁదగిన స్థానము.

శ్లో. శ్రీరామాఽమలపుణ్డరీకనయన శ్రీరామ సీతాపతే
గోవిందాఽచ్యుత నందనందన ముకుందాఽనంద దామోదర,
విష్ణో రాఘవ వాసుదేవ నృహరే దేవాఘచూడామణే
సంసారార్ణవకర్ణధారక హరే కృష్ణాయ తుభ్యం నమః. ౧౪

శా. ధీరాగ్రేసర నందనందన హరీ దేవాఘచూడామణీ
ఘోరాఘౌఘహరా ముకుంద నృహరీ గోవింద శ్రీకృష్ణ సం

సారాంభోనిధికర్ణధార కమలాభర్తా శౌరి దామోదరా
శ్రీరామాచ్యుత జానకీరమణ నిన్ సేవింతు నిష్టార్తికిన్.

తా. శ్రీరామా! నిర్మలా! పుండరీకాక్షా! శ్రీరామా! సీతాపతీ! గోవిందా! అచ్యుతా! నందనందనా! ముకుందా! ఆనందస్వరూపా! దామోదరా! విష్ణూ! రాఘవా! వాసుదేవా! నృసింహా! దేవశిఖామణీ! సంసారసముద్రనావికా! హరీ! భక్తుల పాపములఁ దొలఁగించునీకు నమస్కారము.

శ్లో. రామం లక్ష్మణపూర్వజం రఘువరం సీతాపతిం సుందరం
కాకుత్స్థం కరుణాకరం గుణనిధిం విప్రప్రియం ధార్మికమ్,
రాజత్కుండలమండితాననరుచిం రాత్రించరధ్వంసినం
కంపాకోటిసమానకాంతివిలసన్మాయామృగఘ్నం భజే. ౧౫

మ. ధరణీజాధిపతిన్ లసద్గుణుఁ బరంధాముం బ్రసూనాస్త్రసుం
దరుఁ గాకుత్స్థుని ధార్మికున్ రఘువరున్ దైత్యారి విప్రప్రియున్
గురుచంచత్కమనీయకంబరహరద్ఘోరాస్త్ర సత్కుండలా
ధరుని రాముని లక్ష్మణాగ్రజుఁ గృపాభ్రాజిష్ణుఁ గీర్తించెదన్.

తా. లక్ష్మణుని కన్నయు, రఘువరుఁడును, సీతాపతియు, సుందరుఁడును, కకుత్స్థుని వంశమునఁ బుట్టినవాఁడును, దయానిధియు, గుణనిధియు, బ్రాహ్మణప్రియుఁడును, ధర్మాత్ముఁడును, ప్రకాశించుకుండలములచే నలంకరింపఁబడినముఖకాంతి గలవాఁడును, రాక్షసనాశకుఁడును, కోట్లకొలఁది మెఱుపులతో సమానమయిన కాంతిచేఁ బ్రకాశించుమాయలేడిని చంపినవాఁడును అయినరాముని సేవించుచుందును.

శ్లో. రామం రత్నకిరీటకుండలధరం కేయూరహారాన్వితం
సీతాలంకృతవామభాగ మతులం సింహాసనస్థం ప్రభుమ్,
సుగ్రీవాదిసమస్తవానరవరైః సంసేవ్యమానం సదా
విశ్వామిత్రపరాశరాదిమునిభి స్సంస్తూయమానం భజే. ౧౬

చ. క్షితిసుత వామభాగమునఁ జేరి వసింప వసిష్ఠకౌశికా
ద్యతతులు ప్రస్తుతింప రవిజాదివలీముఖు లెల్లఁ గొల్వఁగాఁ
బ్రతనకిరీటకుండలవిభాసితసుందరదివ్యమూర్తియై
వితతమృగేంద్రపీఠమున వేడుక నొప్పెడురాము సన్నుదన్.

తా. రత్నములతోడి కిరీటమును కుండలములను ధరించినవాఁడును, బాహుపురులతోను ముత్యాలహారములతోను గూడినవాఁడును, సీతచేత నలంకరింపఁబడిన యెడమభాగముగలవాఁడును, సాటిలేనివాఁడును, సింహాసనమున నున్నవాఁడును,

ప్రభువును, సుగ్రీవుఁడు మొదలగు వానరశ్రేష్ఠులచేతను ఎల్లప్పుడును చక్కఁగా సేవింపఁబడుచుండువాఁడును, విశ్వామిత్రుఁడు పరాశరుఁడు మొదలైన మునులచే లెస్సగా స్తోత్రము చేయఁబడుచుండువాఁడును అగు రాముని సేవించెదను.

శ్లో. రామః సీతాసమేతో నివసతు హృదయే సానుజం రామమీశే
రామేణ క్షీణపాప త్రివిధమపి కృతం కర్మ రామాయ దద్యామ్,
రామా దన్యం నజానే నహి కిమపి మహో రామనామ్నా స్వమానం
రామే పశ్యామి విశ్వం భువనమనుదినం పాహి మాం రామచంద్ర.

ఉ. రాముఁడు ప్రోచు సంతతము రాము నుతింతును రాముచేత మ
త్కాంక్షితముల్ ఫలించు నిరతంబును రామున కేను మ్రొక్కెదన్
రామున కెక్కు డెవ్వఁ డిఁక రాముని పాదము నెంతు రాముపైఁ
బ్రేమ చెలంగు మద్ధృదయవీథి వసింపుము రామ వేఁడెదన్. ౧౭

తా. రాముఁడు సీతాసహితుఁడై నాహృదయమున వసించుఁగాక! సోదరసహితుఁడయిన రాముని స్తుతించెదను. రామునిచే క్షీణింపఁజేయఁబడినపాపములుగలవాఁడ నయితిని. మనస్సు వాక్కు శరీరములచేతను చేయఁబడిన మూఁడువిధములయిన కర్మములను రామునికొఱ కర్పించెదను. రామునికంటె నితరుని నే నెఱుఁగను. గొప్పదగు రామనామమునకు సమమయిన దింకేదియు లేదు. సమస్తప్రపంచమును రాముని యందుఁ జూచుచున్నాను. రామచంద్రా! నన్నెల్లప్పుడును రక్షింపుము.

శ్లో. రామం రాజశిఖామణిం రఘుపతిం దేవారిదర్పాపహం
లోకానాం హితకారిణం గుణనిధిం కారుణ్యపుణ్యోదయమ్,
ముక్తావిద్రుమరత్నశోభితతనుం సౌందర్యహాస్తాంబుజం
కౌసల్యాతనయం భజామి సతతం శ్రీజానకీనాయకమ్. ౧౮

చ. మరకతముఖ్యరత్నసమమాన్వితవిగ్రహుఁ గౌసలేయు దు
ర్భరదనుజప్రహారు రఘురాజశిఖామణి జానకీమనో
హరుఁ ద్రిజగద్ధితుఁ శమదమాద్యసమానగుణాకరుఁ సురే
శ్వరనుతు రామచంద్రు బుధవత్సలు ధార్మికు నాశ్రయించెదన్.

తా. రాజశిఖామణియు, రఘుపతియు, రాక్షసులగర్వ మడఁచినవాఁడును, లోకములకు మేలుచేయువాఁడును, గుణనిధియును, దయాపుణ్యములయభివృద్ధిగలవాఁడును, ముత్యములు, పగడములు, రత్నములు అనువానిచేఁ బ్రకాశింపఁజేయఁబడిన శరీరము గలవాఁడును, చక్కనిహస్తపద్మములు గలవాఁడును, కౌసల్య కుమారుఁడును, లక్ష్మీస్వరూపయగుసీతకు నాయకుఁడును అగురాముని నే నెపుడును సేవింతును.

శ్లో. రామం వీరాసనస్థం హృదయగతకరోదంచితజ్ఞానముద్రం
జాను న్యాసక్తహస్తం క్షితివరతనయాభూషితం వామభాగే,

షట్కోణే వ్యాహరంతం పవనసుతయుతం మానసే మానసంస్థే
సుగ్రీవే సేవమానే ధృతశరధనుషా దక్షిణే లక్ష్మణేన. ౧౯

మ. శరచాపాన్వితుఁ డైనలక్ష్మణుఁడు నాత్మాపుత్రి పార్శ్వస్థుఁ డై
కర మొప్పన్ రవిజుండు గొల్వఁగను వ్యాఖ్యానంబు సామీరికిన్
వరషట్కోణనివాసి యై తెలుపుచున్ సర్వజ్ఞుగా సువీరాసన
స్థితు హృత్సంస్థితబోధముద్రకరు సంస్నిగ్ధోరువక్షోజ్జ్వల
త్కరపద్మున్ రఘురామచంద్రు మనసా కాంతు న్విలోకింపుమా.

తా. వీరాసనమునఁ గూర్చున్నవాఁడును, హృదయమునం దుంపఁబడిన చేత నొప్పుచున్న జ్ఞానముద్రగలవాఁడును, ఎడమమోఁకాలిపై నెడమచేతి నుంచినవాఁడును, ఎడమవైపున సీతచే నలంకరింపఁబడినవాఁడును, షట్కోణమధ్యమునందుండి, ఆంజనేయునుద్దేశించి తత్త్వము నుపదేశించువాఁడును, తన్ను సేవించు సుగ్రీవుని విధమున మనసులో గౌరవించుచున్నవాఁడును, ధనుర్బాణధరుఁడైన లక్ష్మణునిచేఁ గుడివైపున సేవింపఁబడువాఁడును అగురాముని సేవించెదను.

శ్లో. రామం సౌమిత్రిమిత్రం రఘుపతి మమలం రామచంద్రం రమేశం
రమ్యం శ్రీరామవేషం శుభలలితముఖం శుద్ధసత్త్వం సువీరమ్,
సీతాసౌందర్యపాత్రం సురమునివినుతం నీరదేందీవరాభం
వందే వందారుపాలం రజనిచరహరం రమ్యకోదండపాణిమ్ ౨౦

శా. రాముల్ సత్యపరాక్రముల్ పరసుమిత్రాపుత్రమిత్రుల్ రఘు
స్వాముల్ భూమిసుతాధినాథుని బుధస్తవ్యుల్ బలేశుల్ బలం
ధాముల్ రాఘవు రామచంద్రుని సుధాధామాననుల్ వారిద
శ్యాముల్ దైత్యవిరాముఁ గార్ముకధరు న్సద్భక్తిఁ గీర్తించెదన్.

తా. లక్ష్మణునికి స్నేహితుఁడును, రఘువంశ పాలకుఁడును, నిర్మలుండును, లక్ష్మీస్వరూపయగు సీతకుఁ బెనిమిటియు, చక్కనివాఁడును, శ్రీమంతులగు రఘువంశపురాజులకుఁ బ్రభువును, శుభప్రదమును సుందరమునయిన ముఖముగలవాఁడును, శుద్ధసత్త్వప్రధానుఁడును, మంచివాఁడును, సీతచక్కదనమునకుఁ బాత్రుఁడును, సురలచే మునులచే స్తుతింపఁబడువాఁడును, మేఘమువంటికలువలవంటి కాంతిగలవాఁడును, నమస్కరించువారిని రక్షించువాఁడును, రాక్షససంహారుఁడును, చక్కనివింటిచేఁ గ్రీడించువాఁడును, అగు శ్రీరామచంద్రునికి వందనములు చేయుచుందును.

శ్లో. రామం చందనశీతలం క్షితిసుతామోహాకరం శ్రీకరం
వైదేహీనయనారవిందమిహిరం సంపూర్ణచంద్రాననమ్,

రాజానం కరుణాసమేతనయనం సీతామనస్స్యందనం
సీతాదర్పణచారుగండలలితం వందే సదా రాఘవమ్ ౨౧

మ. వరశ్రీచందనశీతలుం శుభకరుం వైదేహీహృన్మోహనుం
ధరణీజాననకంజకంజహితు సీతామానసస్యందనుం
గరుణాసంయుతలోచనుం మిథిలరాట్కన్యామణీదర్పణ
స్ఫురదత్యచ్ఛతగండభాగు రఘువంశ్యుం రాము సేవించెదన్.

తా. మంచిగందములవలెఁ జల్లనివాఁడును, సీతామనోహరుఁడును, భక్తులం కైశ్వర్య మిచ్చువాఁడును, సీతకనుదమ్ములకు సూర్యునివంటివాఁడును, పున్నమచందురునివంటి మొగముగలవాఁడును, ప్రజారంజకుఁడును, దయారసార్ద్రములయిన కన్నులం గలవాఁడును, సీత మనోరథస్వరూపుఁడును, అద్దమువలె నిగనిగలాడు సీతచెక్కిళ్లయందుఁ బ్రతిఫలించువాఁడును, అగు రాఘవరాముని నెప్పుడును నమస్కరింతును.

శ్లో. రామం శ్యామాభిరామం రవిశశినయనం కోటిసూర్యప్రకాశం
దివ్యం దివ్యాస్త్రపాణిం శరముఖశరధిం చారుకోదండహస్తమ్,
కాలం కాలాగ్నిరుద్రం రిపుకులదహనం విఘ్నవిచ్ఛేదదక్షం
భీమం భీమాట్టహాసం సకలభయహరం రామచంద్రం భజేఽహమ్.

మ. శరచాపోజ్జ్వలహస్తు శత్రుకులనిస్తారున్ సహస్రాంశుకో
టిరమాభ్రాజితు శార్ఙ్గిఁ గోమలునిఁ గోటీరాఢ్యుఁ జంద్రార్కభా
స్వరదక్షిద్వయు విఘ్నసంహరు ఘనశ్యామాంగు భీమాట్టహా
సరసోద్దీపితు సాధ్వసాపహు రఘుస్వామిన్ భజింతున్ మదిన్.

తా. చల్లనివాఁడును, మనోహరుఁడును, సూర్యచంద్రులు నేత్రములుగా గల వాఁడును, కోట్లకొలఁది సూర్యుల వెలుఁగువంటి వెలుఁగుగల వాఁడును, దివ్యమూర్తియు, దివ్యాస్త్రములు హస్తమునఁ గలవాఁడును, సముద్రుని బాణాగ్రమునకుఁ దెచ్చినవాఁడును, శార్ఙ్గమను విల్లు పట్టినవాఁడును, కాలస్వరూపుఁడును, కాలాగ్నిరుద్రస్వరూపుఁడును, శత్రువంశములను వంశముల (వెదుళ్ళను) దహించువాఁడును, భక్తులవిఘ్నములను ఛేదింప నెఱిఁగిన వాఁడును, శత్రుభయంకరుఁడును, భయమును గలిగించు నట్టహాసము చేయువాఁడును, ఎల్లభయములను హరించువాఁడును అగు శ్రీరామచంద్రుని సేవించుచుందును.

శ్లో. రామచంద్ర చరితాకథామృతం, లక్ష్మణాగ్రజ గుణానుకీర్తనమ్,
రాఘవేశ తవ పాదసేవనం, సంభవంతు మమ జన్మజన్మని. ౨౩

ఉ. రామ భవత్కథామృతము రమ్యతఁ గ్రోలఁగ నామకీర్తనల్
ప్రేమ నొనర్ప నీదుగుణలీలలు సంస్మరణంబు సేయ నా

ధామతి నీకు పావనపదద్వయసేవ దొరకొన్నట్లుగా
మామకజన్మజన్మముల ♦ మానక సత్కృప నిమ్ము వేడెదన్.

తా. రామచంద్రా! నాకుఁ బ్రతిజన్మమునందును నీచరిత్రకు సంబంధించిన అమృతమువంటినీకథ వినుచుండుటయు, లక్ష్మణాగ్రజా! నీగుణములను గానముచేయుచుంటయు, రాఘవేశా! నీపాదములను సేవించుచుంటయు సంభవించుచుండుఁగాక!

శ్లో. రామో మత్కులదైవతం సకరుణం రామం భజే సాదరం
రామేణాఽఖిలఘోరపాపనిహతీ రామాయ తస్మై నమః,
రామా న్నాస్తి జగత్త్రయైకసులభో రామస్య దాసోఽ స్మ్యహం
రామే ప్రీతి రతీవ మే కులగురో! శ్రీరామ! రక్షస్వ మామ్. ౨౮

ఉ. రాముఁ డభీష్టదైవతము ♦ రాముని భావనఁ జేయుచుండు శ్రీ
రామునిచేత దుర్దురిత♦రాసు లడంగును రామభద్రకై
ప్రేమ నమస్కరింతు రఘు♦వీరునికంటెఁ బరుండు లేఁడు శ్రీ
రామున కేను దాసుఁడను ♦ రామునియందున భక్తి నా కగున్.

తా. రాముఁడు మావంశమునకు దేవుఁడు. దయాళుఁడయినరాముని సాదరముగ సేవించెదను. రామునిచే భయంకరములయిన సారెల్లపాపములను తొలఁగింపఁబడును. పరబ్రహ్మస్వరూపుఁడయినరామునికొఱకు నమస్కరింతును. ముల్లోకములను రాముని కంటె సులభుఁడు లేఁడు. నేను రామునకు దాసుఁడను. రామునియందు నా కెంతయుఁ బ్రీతి గలదు. మాకులగురువగు రామా! నన్ను రక్షింపుము.

శ్లో. శ్రీరామచంద్ర తవ కీర్తిసురద్రుమస్య
తారాగణ స్సుమనసః ఫల మిందుబింబమ్,
మూలం ఫణాఫణిగతం గగనంచ మధ్యం
శాఖా దిశో భువనమండల మాలవాలమ్. ౨౯

ఉ. రామునికీర్తి కల్పకము ♦ రమ్యసుమంబులు తారకల్ సుధా
ధాముఁడు తత్ఫలంబు విది♦తం బగుశాఖలు దిగ్వితానముల్
భూమియు ప్రోది భోగిపతి♦మూలము మధ్యము పుష్కరం బగున్
రాము నుతింప నేరికిఁ ద♦రంబు కరం బతిభక్తిఁ గొల్చెదన్.

తా. శ్రీరామచంద్రా! నీకీర్తి యనెడి కల్పవృక్షమునకుఁ జుక్కలే పూవులు. చంద్రబింబము ఫలము. అనంతుఁడు మూఁకటివేరు. ఆకాశము మధ్యభాగము. దిక్కులు కొమ్మలు. భూలోకము పాదు.

శ్లో. వైదేహీం ముదితోఽభిజాతపులకాం గాఢం సమాలింగయన్
వామేన స్తనచూచుకం పులకితం వామం కరేణ స్పృశన్,

తత్త్వం దక్షిణపాణినా కలితయా చిన్ముద్రయా బోధయన్
రామో మారుతిసేవిత స్స్మరతు మాం సామ్రాజ్యసింహాసనే. ౨౫

శా. సీతన్ వామాదము నొంద బాహుకరసంశ్లేషంబు గావింపుచున్
ప్రీతిన్ దక్కఁగ నుంచి దక్షిణపుఁబాణిన్ దత్త్వముం దెల్పుచున్
వాతోత్పన్నునిసేవ గైకొనుచు సానందంబునన్ లోకవి
ఖ్యాతిన్ బంచముఖాసనస్థుఁ డగు రామాధీశుఁ బ్రార్థించెదన్.

తా. సామ్రాజ్యసింహాసనమందుఁ గూర్చుండి యెడమతొడపయిని ఒడలు పులకరించుచుండఁగాఁ గూర్చుండియున్న సీతను సంతోషించుచు నెడమబాహువుచే గాఢముగఁ గౌఁగిలించుకొనుచు, ఎడమచేతితోఁ బులకరించినయామె వామస్తనాగ్రమును స్పృశించుచు, కుడిచేతితోఁ గూర్పఁబడిన జ్ఞానముద్రచేఁ దత్త్వమును బోధించుచు, ఆంజనేయునిచే సేవింపఁబడుచున్న రాముఁడు నన్ను స్మరించుచుండుఁగాక!

శ్లో. వామాంకస్థితజానకీం పరిలసత్కోదండదండం కరే
చక్రం చోర్ధ్వకరేణ బాహుయుగళే శంఖం శరం దక్షిణే,
బిభ్రాణం జలజాతపత్రనయనం భద్రాద్రిమూర్ధ్ని స్థితం
కేయూరాదివిభూషితం రఘుపతిం రామం భజే శ్యామలమ్. ౨౬

మ. శరచాపాబ్జరథాంగముల్ కరచతుష్కప్రాప్తమై యుండ ను
స్థిరవామాంకమునందు సీత నియతిన్ సేవింప భద్రాద్రిపై
నిరవై నట్టిసరోజనేత్రుఁ బహుయోగీంద్రేంద్రసంస్తుత్యు భా
సురకేయూరవిభూషణున్ దలఁచెదన్ శుద్ధాంతరంగంబునన్.

తా. ఎడమతొడపయిఁ గూర్చున్నసీతను, ప్రకాశించు ధనుర్దండమును, ఎడమ పై భుజమందు క్రిందిచేతను, మీఁదిచేతను చక్రమును, కుడిపై భుజమందు మీఁదిచేతను శంఖమును, క్రిందిచేతను బాణమును బట్టుకొని, భద్రగిరిశిఖరముపై నున్నవాఁడును, తామరలవంటికన్నులుగలవాఁడును, భుజకీర్తులు మొదలగు నగలచే నలంకరింపఁబడిన వాఁడును, రఘువంశపాలకుఁడును, నల్లనివాఁడునునగు రాముని సేవించెదను.

శ్లో. వామే భూమిసుతా పురస్తు హనుమా న్పశ్చా త్సుమిత్రాసుత
శ్శత్రుఘ్నో భరతశ్చ పార్శ్వదళయో ర్వాయ్వాదికోణేష్వపి,
సుగ్రీవశ్చ విభీషణశ్చ యువరాట్ తారాసుతో జాంబవాన్
మధ్యే నీలసరోజకోమలరుచిం రామం భజే శ్యామలమ్. ౨౭

మ. తనవామాంకమునందు సీత చెలువొందన్ వెన్క సౌమిత్రి పా
వనియున్ ముంగల శత్రుఘాతిభరతుల్ పార్శ్వంబులన్ భానుసం

దననీలాంగదముఖ్యు లష్టమగుదిక్‌స్థానంబులం దుండఁగా
ఘననీలాంగుఁ డదంతరస్థితు మదిఁ గాంతుంతు రామప్రభున్.

తా. ఎడమవయిపున సీతయు, ఎదుట సాంజనేయుఁడును, వెనుక లక్ష్మణుఁడును, భరతశత్రుఘ్నులు పార్శ్వదళములయందును, వాయుమూల మొదలగు నాలుగు మూలలదళములయందు, సుగ్రీవుఁడు, విభీషణుఁడు, యువరాజు తారకుఁడును అను అంగదుఁడును, జాంబవంతుఁడును సేవించుచుండఁగా అష్టదళపద్మమధ్యమునఁ గూర్చుండియున్నవాఁడును, నల్లఁగలువవలె మృదువయిన శరీరకాంతిగలిగి నల్లనివాఁడును అగురాముని సేవించెదను.

శ్లో. వైదేహీసహితం సురద్రుమతలే హైమే మహామంటపే
మధ్యేపుష్పక మాసనే మణిమయే వీరాసనే సంస్థితమ్,
అగ్రే వాచయతి ప్రభంజనసుతే తత్త్వం మునిభ్యః పరం
వ్యాఖ్యాంతం భరతాదిభిః పరివృతం రామం భజే శ్యామలమ్ ౨౯

ఉ. భాసురకల్పసాలమున భర్మగృహంబునఁ బుష్పకాంతరో
ద్భాసితపూర్ణరత్నమయపంచముఖాసనమందు ముఖ్యవీ
రాసనుఁ వై సతీసహితుఁ వై భరతత్రయ సోదరాన్వితుం
వై సరస న్మరుత్సుతసమర్చితుఁ వైనవిభుం భజించెదన్.

తా. కల్పవృక్షముక్రింద బంగారుమంటపమున, పుష్పకముమధ్యను, మణిమయమయినపీటపయిని వీరాసనముచేసికొని కూర్చున్నవాఁడును, ఎదుటను గూర్చుండి, ఆంజనేయుఁడు చదువుచుండఁ బరతత్త్వమును మునులకుఁ బ్రకటించుచున్నవాఁడును, భరతాదులచేఁ జుట్టుకొనఁబడినవాఁడును నల్లనివాఁడును అగురాముని సేవించుచుందును.

శ్లో. వైదేహీం పరిరభ్య జాతపులకాం లజ్జావతీం సుస్మితాం
కాంచీనూపురహారకంకణలసత్కర్ణావతంసోజ్జ్వలామ్,
కస్తూరీఘనసారచర్చితకుచాం చంద్రాననాం శ్యామలం
కందర్పాధికసుందరం రఘుపతిం శ్రీరామచంద్రం భజే. ౩౦

చ. దరహసితాననన్ బులకితన్ ఘనసారమృగీమదాగరు
స్ఫురదనులేపనన్ గనకభూషణభూషితఁ బూర్ణచంద్రసుం
దరవదనన్ విదేహతనయన్ మది రంజిలఁ జేయునట్టికం
ధరసమవర్ణు నంగజశతప్రతిమానుని రాము సన్నుదన్.

తా. ఒడలుపులకరించినదియు, సిగ్గుగలదియు, చిఱునగవుగలదియు, మొలనూలు, అందెలు, హారములు, కంకణములు, ప్రకాశించుకర్ణభూషణములు మొదలగు

నగలచేఁ బ్రకాశించుచున్నదియు, స్తనములయందుఁ గస్తూరీకర్పూరమిశ్రిత మయిన చందనపుఁబూఁత గలదియు, చంద్రునివంటి మొగముగలదియు నగుసీతను కౌఁగి లించుకొనియున్నవాఁడును, మన్మథునికంటెను ఎక్కువచక్కనివాఁడును, రఘు వంశపాలకుఁడును, దాయనదాయవాఁడును అగు శ్రీరామచంద్రుని సేవించెదను.

శ్లో. వైదేహీరమణం విభీషణవిభుం విష్ణుస్వరూపం హరిం
విశ్వోత్పత్తివిపత్తిపోషణకరం విద్యాధరై రర్చితమ్,
వైరిధ్వంసకరం విరించిజనకం విశ్వాత్మకం వ్యాపకం
వ్యాసాంగీరసనారదాదివినుతం వందామహే రాఘవమ్. ౩౧

చ. జనకసుతాధినాథు రిపుజైత్రు సురార్చితు సర్వలోకసం
జననవినాశకారణుఁ బ్రశస్తచరిత్రు విభీషణావనున్
సనకసనందనాద్యఖిలసన్మునిసన్నుతు విష్ణురూపునిన్
వనరుహసూతితండ్రి రఘువర్యు హరిన్ శరణంబు వేఁడెదన్.

తా. సీతను సంగ్రహింపఁజేయువాఁడును, విభీషణునికి రాజ్య మిచ్చినవాఁడును, విష్ణుస్వరూపుఁడును, భక్తులతాపత్రయమును హరించువాఁడును, ప్రపంచమునుత్పత్తిస్థితిసంహారములు చేయువాఁడును, విద్యాధరులచేఁ బూజింపఁబడువాఁడును, శత్రువులను ధ్వంసముచేయువాఁడును, బ్రహ్మను గన్నవాఁడును, ప్రపంచస్వరూపుఁడును, వ్యాపకుఁడును, వ్యాసులు, అంగిరసుఁడు, నారదుఁడు మొదలగువారిచే స్తుతింపఁబడువాఁడును అగు రాఘవరాముని గూర్చి నమస్కరించుచుందుము.

శ్లో. వైదేహ్య పురే వివాహసమయే కల్యాణవేద్యంతరే
సామోదే విమలేందురత్నఖచితే పీఠే వసంతౌ శుభే,
శృణ్వంతౌ నిగమాంతతత్త్వవిదుషా మాశీర్గిర స్సాదరం
పాయాస్తాం సువధూవరౌ రఘుపతి శ్రీజానకీ చానిశమ్. ౩౨

చ. పరిణయవేళ మైథిలనృపాలగృహాంతరరత్నవేదికన్
సురుచిరవేదవిద్విబుధసూక్తులు వించు సముంచితంబుగాఁ
బరఁగు వధూవరత్వమున భాసిలి భూవరసేవ్యులైనయా
ధరణిసుతారఘూద్వహులు దారమతిన్ మముఁబ్రోతు రెప్పుడున్.

తా. మిథిలానగరమున, పెండ్లివేళను, ప్రకాశించుచున్న పెండ్లి చవికమీఁదను నిర్మలచంద్రకాంతమణిఖచితమయిన పెండ్లిపీటమైని గూర్చుండి, ఉపనిషత్తులతత్త్వ మునెఱిఁగిన పండితుల-ఆశీర్వాదవాక్యములను సాదరముగ వినుచున్నవారును, ఆదర్శ దంపతులును అగు శ్రీసీతాదేవియు, శ్రీరాముఁడును సదా రక్షింతురుగాక!

శ్లో. అసితకమలభాసా భాసయంతం త్రిలోకీం
దశరథకులదీపం దైవతాంభోజభానుమ్,
దినకరకులబాలం దివ్యకోదండపాణిం
కనకఖచితరత్నాలంకృతం రామ మీడే. ౩౩

మ. ఘననీలాంబుదకాంతిదేహు భువనైకఖ్యాతుఁ దేవతా
వనజాతాంబుజమిత్రు భానుకులభాస్వత్కీర్తిసాంద్రున్ శరా
సనబాణోజ్జ్వలహస్తు రత్నవిలసత్స్వర్ణసద్భూషణున్
మునిసంస్తుత్యచరిత్రు దాశరథి రామున్ గొల్తు నెల్లప్పుడున్.

తా. నల్లగలువవంటియొడలికాంతిచే ముల్లోకములను ప్రకాశింపఁజేయుచున్నవాఁడును, దశరథునివంశమునకు దీపమువంటివాఁడును, దేవతలనెడి పద్మములకు సూర్యుఁడును, సూర్యవంశపుబాలుఁడును, దివ్యధనువును ధరించినవాఁడును, రత్నఖచితములయిన బంగారునగలచే నలంకృతుఁడును అగు రాముని స్తుతింతును.

శ్లో. సుస్నిగ్ధం నీలకేశం స్ఫుటమధురముఖం సుందరభ్రూలలాటం
దీర్ఘాక్షం చారునాసాపుట మమలమణిశ్రేణికాదంతపఙ్క్తిమ్,
బింబోష్ఠం కంబుకంఠం కఠినతరమహోరస్క మాజానుబాహుం
ముష్టిగ్రాహ్యావలగ్నం పృథుజఘన ముదారోరుజంఘాంఘ్రిమీడే.

ఉ. చారువిశాలనేత్రు విలసన్మధురానను నీలకేశు శృం
గారలలాటు దీర్ఘకరుఁ గంబుగళున్ రమణీయనాసికున్
క్రూరభుజాంతరున్ సరసకుందరదున్ దనుమధ్యసుందరున్
సారససైకతాంఘ్రివిలసజ్జఘనున్ రఘురాముఁ గొల్చెదన్. ౩౪

తా. ఇంద్రనీలమణివలె నిగనిగలాడుకేశముగలవాఁడును, నల్లనిజుట్టుగలవాఁడును, స్ఫుటముగ మధురముగ నుండుమొగముగలవాఁడును, చక్కనిబొమలు నుదురు గలవాఁడును, పెద్దకన్నులు గలవాఁడును, సొగసయిన ముక్కుపుటములు గలవాఁడును, వజ్రాలవరుసవంటి దంతములపంక్తిగలవాఁడును, దొండపండువంటి పెదవి గలవాఁడును, శంఖమువంటి కంఠముగలవాఁడును, మిగులఁ గఠినమై విశాలమయిన రొమ్ముగలవాఁడును, మోఁకాళ్ళను ముట్టు చేతులుగలవాఁడును, పిడికిటఁ బట్టఁదగిన నడుముగలవాఁడును, విస్తరించిన పిఱుఁదులు గలవాఁడును, ఉదారములయిన తొడలు, పిక్కలు, పాదములు గలవాఁడును అగు రాముని స్తోత్రముచేయుచుందును.

శ్లో. వందామహే మహేశానచండకోదండఖండనమ్,
జానకీహృదయానందచందనం రఘునందనమ్. ౩

చ. జలనిధివేష్టితాఖిలవ♦సాభృదహీంద్రవిభూషణాదిగో
జ్జ్వలహరచాపఖండనవి♦శాలభుజాబలశాలివై దయా
జలధివై భూమిజాహృదయ♦సారసహేళివై శీలివై మహా
బలతనయార్చితాంఘ్రినవ♦పద్మునకున్ శరణం బొనర్చెదన్.

తా. ఎవ్వరును ఎత్తఁజాలనియీశ్వరునిదొడ్డవింటిని విఱిచినవాఁడును, సీత మనసున కానందము గలిగింపఁ జాలినట్టివాఁడును, రఘువంశము నానందింపఁ జేయువాఁడును అగురామునకు వందనములు చేయుచుందును.

శ్లో. జానాతి రామ! తవ నామరుచిం మహేశో
జానాతి గౌతమసతీ చరణప్రభావమ్,
జానాతి దోర్బలపరాక్రమ మీశచాపో
జానా త్యమోఘపటుబాణగతిం పయోధిః. ౩౮

ఉ. తారకనామమంత్రరుచి ♦ దక్షసుతారమణుఁ డెఱుంగు నీ
పావనపాదపంకజప్ర♦భావ మహల్య యెఱుంగు మిక్కిలిన్
దేవరదోర్బలంబు శివ♦దేవునిచాప మెఱుంగు నీదుతే
ధావిభవంబు గల్గుశర♦ధాటి సముద్రుఁ డెఱుంగు రాఘవా.

తా. రామా! నీనామమురుచి యీశ్వరుఁడెఱుఁగును, నీపాదప్రభావమును అహల్యయు, నీబాహుబలపరాక్రమముల నీశ్వరధనుస్సును, అమోఘమును సమర్థము నయిన నీబాణగతిని సముద్రుఁడును ఎఱుఁగుదురు.

శ్లో. దివ్యస్యందనమధ్యగం రణరణచ్చాపాన్వితం భీషణం
కాలాగ్నిప్రతిమానబాణకలితం ఘోరాస్త్రతూణీద్వయమ్,
సుగ్రీవాంగదరావణానుజమరుత్పుత్రాదిసంసేవితం
రామం రాక్షసవీరకోటిహరణం రక్తాంబుజాక్షం భజే. ౩౯

శా. సారస్యందనమధ్యగున్ రణరణ♦చ్చాపాన్వితున్ రాఘవున్
ఘోరాగ్నిప్రతిమానబాణకలితున్ ♦ క్రూరాస్త్రతూణీద్వయున్
సూరాత్మోద్భవరావణానుజమరు♦త్సూన్వాదిసంసేవితున్
వీరున్ రక్తసరోజనేత్రు హతవి♦ద్వేషుం బ్రశంసింతు

తా. దివ్యరథముమధ్యను గూర్చున్నవాఁడును, ... ధ్వనించు ధనువుగలవాఁడును, శత్రుభయంకరుఁడును, ప్రళయాగ్ని... బాణములుగల వాఁడును, భయంకరములయిన అస్త్రములతోనిండియున్నపొదులు గలవాఁడును, ...



వుఁడు, అంగదుఁడు, విభీషణుఁడు, ఆంజనేయుఁడు మొదలగువారిచే సేవింపఁబడు వాఁడును, కోట్లకొలఁదిరాక్షసవీరులను సంహరించినవాఁడును, ఎల్లవారలకోర్కెల దీర్పఁగలవాఁడును అగురాముని సేవించుచుందును.

శ్లో. బ్రహ్మాద్యామరసిద్ధజన్మభువనం యన్నాభిపంకేరుహం
శ్రీనిర్వాణనికేతనం యదుదరం లోకైకశయ్యాగృహమ్,
యద్వక్షః కమలావిలాసభవనం యన్నామమంత్రం సతాం
వాసాగారముఖండమంగళనిధిః పాయాత్స నో రాఘవః॥ ౩౮

ఉ. ఎవ్వనినాభిపద్మము ర♦హిం గా విధిముఖ్యులజన్మకారణం
బెవ్వనివక్ష మిందిరకు ♦ నింపగునట్టివిలాసమందిరం
బెవ్వఁడు ముక్తికిన్ సదన ♦ మెవ్వఁ డశేషజగద్విధాయకుం
డెవ్వనినామ మెంతురు ము♦నీశ్వరు లారఘురాముఁ గొల్చెదన్.

తా. ఎవనినాభిపద్మము బ్రహ్మాదిదేవతలకును సిద్ధులకును పుట్టినిల్లో, లక్ష్మికిముఖ్యమందిరమయిన యెవనియుదరము ప్రళయకాలకెల్లలోకములకును శయనగృహమో, ఎవ్వనివక్షస్థలము లక్ష్మీవిలాసగృహమో, ఎవనినామమంత్రము సత్పురుషులకావాసస్థానమో, అనంతములైన మంగళములకు నిధానమయిన ఆరాముఁడు మమ్మును పాలించుచుండును గాక.

శ్లో. శృంగారం క్షితినందినీవిహరణే వీరం ధనుర్భంజనే
కారుణ్యం బలిభోజనేఽద్భుతరసం సింధా గిరిస్థాపనే,
హాస్యం శూర్పణఖాముఖే భయవహే బీభత్స మన్యాముఖే
రౌద్రం రావణమర్దనే మునిజనే శాంతం వపుః పాతు నః॥ ౩౯

మ. ధరణీపుత్త్రి మునీంద్ర శంకరధనుర్ ♦ దైత్యారి లంకాపురీ
శ్వర వైరోచన రావణానుజలకున్ ♦ సాధారణప్రీతిచే
వరశృంగారము శాంత వీర భయ బీ♦భత్సాద్భుతోగ్రంబులున్
గరుణా హాస్యరసంబు లుప్పతిలు రా♦ద్గాత్రంబు భావించెదన్.

తా. సీతతో విహరించునపుడు శృంగారరసప్రధానమును, శివునివిల్లు విఱుచునపుడు వీరరసప్రధానమును, కాకాసురునివిషయమునఁ గరుణారసప్రధానమును, సముద్రములోఁ గొండలు వేయించి సేతువు గట్టునపు డద్భుతరసప్రధానమును, శూర్పణఖవిషయమున హాస్యరసప్రధానమును, భయంకరమయినయితరస్త్రీలముఖమున బీభత్సరసప్రధానమును, రావణసంహారమున రౌద్రరసప్రధానమును, మునిసంఘమువిషయమున శాంతరసప్రధానమును అగురామునిశరీరము మమ్ముఁ బాలించెడిని.

శ్లో. మాతా రామో మత్పితా రామచంద్రో
భ్రాతా రామో మత్సఖా రాఘవేశః,
సర్వస్వం మే రామచంద్రో దయాళు
ర్నాన్యం దైవం నైవ జానే న జానే. ౪౦

ఉ. రాముఁడె తండ్రి మజ్జనని ♦ రాముఁడె భ్రాతయు రామచంద్రుఁడే
రాముఁడె మిత్రుఁడు స్వకుఁడు ♦ రాముఁడె సర్వధనంబు రాముఁడే
రాముఁడె సత్కృపాకరుఁడు ♦ రామునితోఁ సరి యన్యదైవముల్
వేమఱు లేవు లేదనుచు ♦ వేడ్క భజించెద నిష్టసిద్ధికిన్.

తా. రాముఁడు నాతల్లి, రామచంద్రుఁడు నాతండ్రి, రాముఁడు నాసోదరుఁడు, రాముఁడు నామిత్రుఁడు, దయాళువగురామచంద్రుఁడే నాసర్వస్వము, ఆయనకంటె నితరదైవమును నే నెఱుఁగ నెఱుఁగను.

శ్లో. మూలే కల్పద్రుమస్యాఽఖిలమణివిలసద్రత్నసింహాసనస్థం
కోదండేనాఽఽశుగేనోల్లసితకరయుగేనాఽర్చితం లక్ష్మణేన,
వామాంకన్యస్తసీతం భరతధృతమహావార్తికచ్ఛత్రకాంతం
శత్రుఘ్నే చామరాభ్యాం సువిలసితకరే రామచంద్రం భజేఽహమ్.

చ. సురతరుమూలమందు మణి♦శోభితపీఠిని సీతతోఁ వసిం
ప రహిఁ సుమిత్రపుత్రకుఁడు ♦ మార్గణచాపము లంది యాతుఁగా
భరతుఁడు పుండరీకము శు♦భస్థితిఁ దాల్పఁగ శత్రుఘాతి చా
మరములు వీవఁ జెన్నగుస♦మస్తజగత్ప్రభు రాము నెన్నెదన్.

తా. కల్పవృక్షముక్రింద రత్నములచేతఁ బ్రకాశించుచున్న రత్నసింహాసనమునఁ గూర్చున్నవాఁడును, ధనుర్బాణములచేఁ బ్రకాశించుచేతులుగల లక్ష్మణునిచేతను బూజితుఁడును, ఎడమతొడపైని సీతను గూర్చుండఁబెట్టుకొన్నవాఁడును, భరతుఁడు పట్టిన గొప్పముత్యాలగొడుగుచే మనోహరుఁడును, శత్రుఘ్నుఁడు రెండుచేతుల వింజామరలు పూని కొల్చుచుండఁ నొప్పువాఁడునునగు రాముని భజించెదను.

శ్లో. వామే కోదండదండం నిజకరకమలే దక్షిణే బాణమేకం
పశ్చాద్భాగే చ నిత్యం దధత మభిమతం చాపతూణీరభారమ్,
వామేఽవామే లసద్భ్యాం సహమిలితతనుం జానకీలక్ష్మణాభ్యాం
రామం శ్యామం భజేఽహం ప్రణతజనమనఃఖేదవిచ్ఛేదదక్షమ్.

చ. ఇరుగడలందు లక్ష్మణమ♦హీసుతలుం జెలువొందఁ దూణముల్
శరము శరాసనంబు వరు♦సన్ జరమాంగకరంబులందు వి

స్ఫురతఁ దనర్ప భక్తజనపుంజవిబద్ధరుఁ డైనరామభూ
వరుఁడు జగద్గురుండు భగవంతుఁ డనంతుఁడు నన్నుఁ బ్రోవుతన్.

తా. ఎడమదయిన తనహస్తమధ్యమున ధనుర్దండమును, కుడిచేత సాయకము ను, జానుకను నిత్యమును ఇష్టమయిన ధనువున్, అమ్ములపొదులను ధరించుచున్న వాఁడును, ఎడమకుడివయిపులను ప్రకాశించుచున్న సీతాలక్ష్మణులతోఁ గూడియుండు శరీరముగలవాఁడును, నల్లనివాఁడును, నమస్కరించువారిమనస్సులకుఁ గలుగుకష్ట ములను తొలఁగింపఁ జేయుగలవాఁడును అగురాముని సేవించుచుండును.

శ్లో. అంభోధరశ్యామల మంబుజాక్షం
ధనుర్ధరం బద్ధజటాకలాపమ్,
పార్శ్వద్వయే లక్ష్మణమైథిలీభ్యాం
నిషేవ్యమాణం ప్రణమామి రామమ్. ౪౩

మ. శరదశ్యామలగాత్రుఁ బార్శ్వయుగళస్థానావసీతానుజుం
గుణుతామ్రాంశుజటాకలాపు విలసత్కోదండహస్తుం బరా
త్పరుఁ బంకేరుహపత్త్రనేత్రుఁ గరుణాపాత్రుం బుధస్తోత్రు శ్రీ
చరణన్మిత్రు సురారిజైత్రు రఘువంశస్వామిఁ గీర్తించెదన్.

తా. మేఘమువలె నల్లనివాఁడును, తామరలవంటికన్నులుగలవాఁడును, ధను ర్ధరుఁడును, కూర్పఁబడినజటాజూటముగలవాఁడును, ఇరుప్రక్కలను సీతాలక్ష్మణులచే సేవింపఁబడువాఁడును అగురామునిగూర్చి నమస్కరించుచున్నాను.

శ్లో. కోదండదీక్షాగురు మప్రమేయం సలక్ష్మణం దాశరథిం దయాళుమ్,
అజానుబాహుం జగదేకవీర మనాథనాథం రఘునాథ మీడే.

మ. గురుకారుణ్యరసానిధాను విలసత్కోదండదీక్షాగురుం
వరకల్యాణగుణాకరుం శుభకరుం వైదేహీసంయుక్తు దా
శరథిం లక్ష్మణసేవ్యు నార్తజనరక్షాదక్షదీక్షాకరుం
బను నాజానుకరుం జగద్గురు హరిం భక్తిం బ్రశంసించెదన్.

తా. కోదండదీక్షాగురుఁడును, అప్రమేయుఁడును, లక్ష్మణసహాయుఁడును, దశ రథునికుమారుఁడును, దయాళుఁడును, ఆజానుబాహుఁడును, జగత్తులలో నేకవీరుఁ డును, దిక్కులేనివారికి నాథుఁడును అగురఘువంశనాథుని రాముని నుతించెదను.

శ్లో. కర్పూరాంగవిలేపనం రఘువరం రాజీవనేత్రం ప్రభుం
కస్తూరీనికరాకృతిం ఖరధృతిప్రధ్వంసినం శ్రీహరిమ్,

కందర్పాయుతకోటిసుందరతనుం కామారిసేవ్యం గురుం
కాంతాకామద మప్రమేయ మమలం సీతాసమేతం భజే. ౪౫

మ. ఘనకర్పూరవిలేపను౯ రఘువరు౯ గామారిసేవ్యు౯ ఘనా
ఘనగాత్రు౯ సరసీజనేత్రు ఖరదైత్యశ్రీకాలు రాము౯ సనా
తను౯ గందర్పశతోత్తమాకృతిని గాంతాకాముదు౯ శ్రీహరి౯
జనకక్ష్మారమణాత్మజానయనరాజీవార్కు భావించెద౯.

తా. కర్పూరములోఁ జందనమును బూసికొన్నవాఁడును, తామరలవంటి కన్నులుగలవాఁడును, నిగ్రహానుగ్రహసమర్థుఁడును, కస్తూరిపుష్పవంటి యాకారముగలవాఁడును, ఖరాసురధైర్యమును ధ్వంసముచేసినవాఁడును, శ్రీహరియు, కోట్లకొలఁది మన్మథులకంటెను చక్కనిశరీరముగలవాఁడును, శివునిచే సేవింపఁబడువాఁడును, లోకగురుండును, స్త్రీలకుఁ గామమును గలిగించువాఁడును, అప్రమేయుఁడును, నిర్మలుఁడును, సీతతోఁ గూడినవాఁడును అగురఘురాముని సేవింతును.

శ్లో. నీలాబ్దబృందసదృశం పరిపూర్ణదేహం
దిక్పాలకాదిసురసేవితపాదపద్మమ్,
పీతాంబరం కనకకుండలశోభితాంగం
సీతాపతిం రఘుపతిం సతతం భజామి. ౪౬

మ. మృగనాభీనిభసుందరాంగు భవసన్మిత్రు౯ బవిత్రు౯ లస
న్నిగమాంతార్థవిచారచర్యు సుతవాణీనాథుఁ బీతాంబరు౯
దిగధీశానముఖామరావనుని ధాత్రీపుత్రికాధీశ్వరు౯
భగవంతు న్మణికుండలాభరణు సంభావింతు నశ్రాంతమున్.

తా. నల్లనిమేఘములతో సమానుఁడును, పరిపూర్ణమయిన దేహముగలవాఁడును, దిక్పాలురు మొదలయినదేవతలచే సేవింపఁబడు పాదపద్మములు గలవాఁడును, పచ్చనివస్త్రము గలవాఁడును, బంగారుకుండలములచే శోభిల్లు నంగములుగలవాఁడును, సీతాపతియు నగురఘుపతిని రాముని సదా భజించుచుందును.

శ్లో. భర్గబ్రహ్మసురేంద్రముఖ్యదివిజప్రాంచత్కిరీటాగ్రసం
సర్గానేకమణిప్రభాకరసహస్రాభం పదాంభోరుహే,
దుర్గాసంతతసంస్తుతాంఘ్రికమలం దుర్వారకోదండినం
గంగావిస్ఫుటహాలిమానసహరం కల్యాణరామం భజే. ౪౭

శా. భర్గాంభోజభవేంద్రముఖ్యదివిజప్రాంచత్కిరీటాగ్రసం
సర్గానేకమణిప్రభాకరసమంచత్పాదపంకేరుహు౯

దుర్గానంతరసన్నుతాంఘ్రియుగళుఁ దోషాపహుఁ మానితా
ధ్వర్గప్రస్తుత శంభుమానసహరుఁ వైకుంఠుఁ బ్రార్థించెదన్.

తా. తన పాదపద్మములయందు, శివుఁడు బ్రహ్మ యింద్రుఁడు మొదలయిన దేవతలయొక్కయుకిరీటములలోఁగలసంబంధముగల మణులచేతను వెలిఁగెడుసూర్యుల ప్రకాశమువంటిప్రకాశము గలవాఁడును, దుర్గాదేవిచే సదా కొనియాడఁబడుపాద పద్మములు గలవాఁడును, శత్రువులకు దుర్వారమయిన ధనువుగలవాఁడును, గంగాధరునిమనసును హరించినవాఁడును అగు కల్యాణరాముని సేవించెదను.

శ్లో. అగ్రే ప్రాంజలి మాంజనేయ మనిశం వీరం చ తారాసుతం
పార్శ్వే పఙ్క్తిముఖానుజం పరిసరే సుగ్రీవ ముగ్రాననే,
పశ్చా ల్లక్ష్మణ మంతికే జనకజాం మధ్యే స్థితం రాఘవం
చింతాతూలికయా లిఖంతి సుధియ శ్చిత్తేషు పీతాంబరమ్. ౪౮

చ. పవనజుఁ డంగదుం డెదుటఁ బ్రాంజలులై వినుతింపఁ జెంగటన్
రవిసుతరావణానుజులు రంజిల వెన్క సుమిత్రసూనుఁ డా
యవనితనూజ చేరువను హర్ష మెసంగఁగ సింహపీఠి రు
క్మవనజకర్ణికన్ వెలయుమాధవుఁ జిత్తములోఁ దలంచెదన్.

తా. ఎదుటను చేతులు జోడించియున్న యాంజనేయుని, ప్రక్కను వీరుఁడైనయంగదుని, సమీపమున విభీషణుని, అగ్రాసనమున సుగ్రీవుని, వెనుకను లక్ష్మణుని, సమీపమున సీతను, మధ్యను పీతాంబరుఁడైయున్నరాముని పండితులు తమ చిత్తఫలకములయందు ధ్యానమనుకుంచెతో వ్రాయుచుందురు.

శ్లో. క్షీరాంభోనిధిమధ్యవర్తిని సితే ద్వీపే సువర్ణాచలే
రత్నోల్లాసితకల్పభూరుహతలే జాంబూనదే మంటపే,
తేజోభ్రాజితవేదికే సురుచిరే మాణిక్యసింహాసనే
హేమాంభోరుహకర్ణికోపరితలే వీరాసనస్థం భజే. ౪౯

మ. తెలిదీవిన్ గనకాద్రి దుగ్ధనిధి నుద్దీప్తామరానోకహ
స్థలజాంబూనదమంటపంబున విభాస్వద్వేదికారంజితో
జ్జ్వలసింహాసనజాతరూపమయకంజాతస్ఫురత్కర్ణికా
స్థలి వీరాసనయుక్తుఁ డైన రఘువంశస్వామిఁ గీర్తించెదన్.

తా. పాలసంద్రముమధ్యమున్న శ్వేతద్వీపమున బంగారుకొండపైని రత్నములచేఁ బ్రకాశించు కల్పవృక్షముక్రిందను, బంగారుమంటపమున, తేజముచే వెలుఁగుచుండు వేదికపైని చక్కనిరత్నసింహాసనమునందు బంగారుపద్మమునందలి కర్ణికపైని వీరాసనము వేసికొని కూర్చుండురాముని సేవించుచుండెదను.

శ్లో. దోర్దండేన చ కుండలీకృతమహాకోదండచండాశుగై
ర్దుర్వారై రవికోటితుల్యనిశితై ర్బ్రహ్మాదిదేవస్తుతైః,
సుగ్రీవాదిసమస్తవానరవరా నాజ్ఞాపయంతం గిరా
దైత్యాన్ నాశయ నాశయేత్యనుపదం శ్రీరామచంద్రం భజే.

మ. కరదండంబునఁ గుండలీకృతమహా♦కాండాసనోత్సృష్టభా
స్వరకోటిప్రకటప్రభానిశితదు♦ర్వారంబు లై పద్మజా
మరసంస్తుత్యము లైన బాణములచే ♦ మర్దింపుచున్ వేగ వా
నరసంఘంబులతోడ దైత్యవరులన్ ♦ మర్దింపు మర్దింపుఁ డం
చు రణం బొప్పఁగఁ జెప్పు రాము వసుధే♦శుం డిచ్చు నిష్టార్థముల్.

తా. కోట్లకొలఁది సూర్యులవలెఁ దీక్ష్ణములును, బ్రహ్మ మొదలగు దేవతలచే స్తుతింపఁబడునవియు, తన బాహుదండముచేతను కుండలాకారముగాఁ జేయఁబడిన గొప్ప ధనుస్సునుండి వెలువడునవియు, వారింపరానివియు నగు తీవ్రబాణములచేతను రాక్షసులను జంపుచున్నవాఁడును, మాటిమాటికిని కొట్టుఁడు కొట్టుఁ డని సుగ్రీవాదివానరుల నాజ్ఞాపించుచున్నవాఁడును అగు శ్రీరామచంద్రుని సేవించుచుండెదను.

శ్లో. భూకంపం జనయ న్నభో విదళయ న్నంభోనిధిం క్షోభయన్
దైతేయాంశ్చ విమర్దయన్ గిరివరాన్ భిందన్ దిశః పూరయన్,
వైదేహీ మతిమోదయన్ సకలగీర్వాణాన్ శిరఃకంపయన్
కల్యాణో రఘురామహస్తవిలసత్కోదండచండధ్వనిః. ౫౧

ఉ. రాముని చాపమౌర్విశుభ♦రావమునన్ దల లూఁపు దేవతా
స్తోమము దైత్యు లార్తిఁ గని ♦ సోలుదు రబ్ధులు మ్రోయు మైథిలీ
భామిని సంతసించు నడి ♦ బ్రద్ద లగున్ వసుధాధరంబులున్
భూమి చలించు నంబరము ♦ బూరటిలున్ దిశ లెల్ల ఘూర్ణిలున్.

తా. భూమిని గంపింపఁజేయుచు, ఆకాశమును బ్రద్దలుచేయుచు, సముద్రమును గలఁగించుచు, రాక్షసులను మర్దించుచు, కొండలను భేదింపుచు, దిక్కులను పూరించుచు, సీతను సంతోషింపఁజేయుచు, దేవతల నందఱను తలలూఁపించుచు రామునిచేతను ప్రకాశించు ధనుస్సుయొక్క తీవ్రధ్వని కల్యాణప్రదమై యుండెను.

శ్లో. విమలకమలనేత్రం విస్ఫురన్నీలగాత్రం
తపనకులపవిత్రం దానవధ్వాంతమిత్రమ్,
భువనశుభచరిత్రం భూమిపుత్రీకళత్రం
దశరథవరపుత్రం నౌమి రామాఖ్యమిత్రమ్. ౫౨

శ్లో. సీతాయా దక్షిణే పార్శ్వే లక్ష్మణస్య చ పార్శ్వతః,
తన్మధ్యే రాఘవం వందే ధనుర్బాణధరం హరిమ్.

శ్లో. చంద్రోపమం మలయచందనచర్చితాంగం
మందారపుష్పపరిపూజితపాదపద్మమ్,
బ్రహ్మేంద్ర వంద్య మనిశం మునిబృందసేవ్యం
వందేఽరవిందనయనం రఘురామచంద్రమ్. ౫౫

చ. సరస విదేహరాజతనుసంభవలక్ష్మణయుక్త దేవతా
తరుసుమపూజితాంఘ్రినవతామరసద్వితయుండు సరస్వతీ
శ్వరసురవర్యమానిజనవందితుఁ జందనచర్చితుండు లస
ద్గురుశరచాపధారుని రఘూద్వహు రాముని నెంతు నెంతయున్.

తా. సీతకుఁ గుడిప్రక్కను, లక్ష్మణుని యెడమప్రక్కను వారిమధ్యను ధనుర్బాణములను ధరించువాఁడై విష్ణుస్వరూపుఁ డయినరాముని నమస్కరించెదను. చంద్రునివంటివాఁడును, మలయచందనముచేఁ బూయఁబడిన దేహముగలవాఁడును, కల్పవృక్షపుష్పములచేఁ బూజింపఁబడు పాదపద్మములు గలవాఁడును, బ్రహ్మ, ఇంద్రులచే నమస్కరింపఁదగువాఁడును, ఎల్లప్పుడును మునిసంఘముచే సేవింపఁదగువాఁడును, పద్మములవంటికన్నులు గలవాఁడును, అగు రఘురామచంద్రుని నమస్కరింతును.

శ్లో. ఇక్ష్వాకునందనం సుగ్రీవపూజితం
త్రైలోక్యరక్షకం సత్యసంధం సదా,
రాఘవం రఘుపతిం రాజీవలోచనం
రామచంద్రం భజే రాఘవేశం భజే. ౫౬

మ. మనువంశాంబుధిపూర్ణచంద్రు రఘురామస్వామిఁ ద్రైలోక్యపా
లను సుగ్రీవసమర్చితాంఘ్రికమలుం లక్ష్మీధవుం సత్యసం
ధునిఁ గంజాయతనేత్రు వీరు రఘునాథుం రాఘవుం రామచం
ద్రుని భక్తాంగణకల్పకంబు మది సంతోషంబునం గొల్చెదన్.

తా. ఇక్ష్వాకునందనుఁడును, సుగ్రీవపూజితుఁడును, ముల్లోకములను రక్షించువాఁడును, సత్యసంధుఁడును, రాఘవుఁడును, రఘుపతియును, తామరలవంటి కన్నులు గలవాఁడును, అగురామచంద్రు నెప్పుడును సేవించెదను. రఘువంశపతిని సేవింతును.

శ్లో. బ్రహ్మామృతానందఫలప్రదాయినం
వేదాంతవిజ్ఞానసుగంధపుష్పితమ్,

# శ్రీ రా మ క ర్ణా మృ త ము

ాశుభాంగాంచితబాహుశాఖినం
్రీరామకల్పద్రుమ మాశ్రయామః. ౫౭
లసీతాంగలసత్కరోరువిటపం ♦ బై భవ్యవేదాంతని
లసుజ్ఞానసుగంధపుష్పయుతమై ♦ బ్రహ్మామృతానందస
లదంబై వరతత్త్వవిద్వరులకున్ ♦ భావింపఁ బ్రాధాన్యమై
లకున్ శ్రీరఘురామకల్పకము నా ♦ స్వాంతమునన్ గొల్చెదన్

తా. బ్రహ్మము, అమృతము, ఆనందము-అనెడిఫలము నిచ్చునదియు, వేదాంత
నెడి శాఖలుగలపూలు పూచునదియు, సీతయొక్క మంగళకరములయిన యవ
ములలో ఒప్పుచుండెడి బాహువులనెడి కొమ్మలు గలదియు, నగు శ్రీరాముఁ
ల్పవృక్షము నాశ్రయించుచుందుము.

నకనికషభాసా సీతయాఽఽలింగితాంగో
వకువలయదామశ్యామవర్ణాభిరామః,
భినవయుతవిద్యున్మండితో మేఘఖండ
మయతు మమ తాపం సర్వదా రామచంద్రః ౫౮
మతరత్నప్రభ ద్యనిశ♦ముజ్జ్వలమైన ధరాతనూభవన్
నఁగఁ గూడి నీలమణి♦జాలవిరాజితుఁ డై తటిల్లతా
రదసితాభ్రమో యనఁగఁ ♦ బొల్పు వహించిన రాఘవుండు మ
తసముద్భవం బయిన♦దుస్తర తాపముఁ బాపి ప్రోవుతన్

తా. ఒరగల్లుమైని గీయఁబడినబంగరుగీఁతవంటి కాంతిగల సీతచేతను కౌఁగిలిం
చిన యవయవములుగలవాఁడును, అప్పుడు వికసించిన కలువలదండవంటి
దేహకాంతిచే సొప్పువాఁడు గనుక క్రొత్తదై మెఱుపుని మెఱుపుతో నిండిన
మయిన నొప్పు రామచంద్రుఁడు నాతాపము నెల్లప్పుడును చల్లార్చును గాక.

లం శాస్త్రాభ్యాసై రలమసకృదామ్నాయపఠనై
ం తీర్థస్నానై రల మఖిలయాగవ్రతజపైః,
ం యోగాభ్యాసై రలమపి మహాపాతకభియా
దస్మాకం రామస్మరణమహిమాఽఽయం విజయతే. ౫౯
లును శాస్త్రపాఠములు ♦ చాలును వేదము లభ్యసించుటల్
లు జపంబులుం దపముఁ ♦ జాలు వ్రతంబులుఁ దీర్థయాత్రలున్
ు సదాశివార్చనములు ♦ సత్క్రియవుల్ ఘనయోగనిష్ఠలున్
ఁగ భీతి మాన్ప రఘు♦సత్తముసంస్మరణంబు గల్గుటన్.

ధవు నద్వంద్వు నచింత్యుఁ దత్త్వవిదు భక్తత్రాణపారీణు మా
నవనాథార్చితు రామచంద్రుని జగన్నాథుఁ బ్రశంసించెదన్.

తా. ప్రపంచముయొక్క సృష్టిస్థితి సంహారాదులవిషయమై కారణమునను, ఒక్కఁడును, మాయ కాశ్రయ మైనవాఁడును, మాయ లేనివాఁడును, ఆలోచింపరాని స్వరూపముగలవాఁడును, ఆనందఘనుఁడును, నిర్మలుఁడును, స్వజ్ఞానస్వరూపుఁడును, తెలియఁబడిన యాథార్థ్యము గలవాఁడును, సీతాపతియు నగురాముని నేను ప్రొక్కెదను.

శ్లో. శ్రీరామం నవరత్నకుండలధరం శ్రీరామరక్షామణిం
శ్రీరామం చ సహస్రభానుసదృశం శ్రీరామచంద్రోదయమ్,
శ్రీరామం శ్రుతికీర్తిమూలకర మహం శ్రీరామముక్తిప్రదం
శ్రీరామం రఘునందనం భయహరం శ్రీరామచంద్రం భజే. ౭౫

శా. శ్రీరాముం నవరత్నకుండలధరుం ♦ శ్రీరాము రక్షామణిన్
శ్రీరాముం శతకోటిభానుసదృశుం ♦ శ్రీరాముఁ జంద్రాననున్
శ్రీరాముం శ్రుతికీర్తిమూలకరుఁ బకున్ ♦ శ్రీరాము ముక్తిప్రదున్
శ్రీరాముం రఘునందనున్ భయహరున్ ♦ శ్రీరాము సేవించెదన్.

తా. నవరత్నములతోడి కుండలములను ధరించువాఁడును, శ్రీరామునను వారికి రక్షామణియు, కోటిసూర్యులతో సమానుఁడును, శ్రీరామునను వారికి చంద్రోదయము స్వరూపుఁడును, సౌందర్యముచేఁ గలిగినకీర్తికి స్థానమును, శ్రీరామ అనఁగానే ముక్తి నిచ్చువాఁడును, రఘువంశము నానందింపఁజేసినవాఁడును, భయమును హరించినవాఁడును అగు శ్రీరామచంద్రుని సేవించెదను.

శ్లో. రామచంద్రచరణారవిందయోరంతరంగ! చర భృంగలీలయా,
తత్ర సంతి చ రసాశ్చతుర్విధా మకరందరస ఏవ మోక్షదే. ౭౬

ఉ. శ్రీరఘురామపాదసరసీజములం దలి మాధ్వికముఁ గాంచుఁ డెం
పారఁగ భక్తియుక్తి ననిశంబుఁ జరింపుచు నుండు చిత్తమా!
యారయఁగాఁ జతుర్విధఫలాప్తికరంబులు సంతతంబు మం
దుమాపాళియందుఁ బరికింప రసంబు మోక్షమై ప్రవర్తిలున్.

తా. ఓ నామనసా! శ్రీరామచంద్రుని పాదపద్మములయందుఁ దుమ్మెదవిలాసముతో సంచరింపుము. వానియందు ధర్మార్థకామమోక్ష రూపములయిన చతుర్విధరసములను గలవు. సామాన్యపద్మమునందొక్క మకరందరసమే కలదు.

శ్లో. రామః పాతు సదైవ మాం మురిభయాద్రామం సదా భావయే
రామేణైవ హృతం మహత్తరతమో రామాయ నిత్యం నమః,
రామాన్నాస్తి పరం పదం సులలితౌ రామస్య పాదౌ భజే
రామే ప్రీతి రచంచలాస్తు మమ హే శ్రీరామ మాం పాలయ. ౭౭

ఉ. రాముఁడు ప్రోచు శత్రునిక♦రంబులచే భయ మొందకుండ శ్రీ
రాముని సన్నుతింతు రఘు♦రామునిచే లయ మొందుఁ బాపముల్
రామున కేను మ్రొక్కెదను ♦ రామునికంటెఁ బరంబు లేదు శ్రీ
రామున కేను దాసుఁడను ♦ రామునిపై గురి నిల్పి యుండెదన్.

తా. రాముఁడు నన్నెల్లప్పుడును శత్రుభయమునుండి రక్షించుఁగాక. రాముని సదా భావనచేయుచుందును. రామునిచేతనే మిక్కిలి గొప్పదియగు తమస్సు హరింపఁబడినది. రామునికొఱకు సదా నమస్కరించెదను. రామునికంటెను పరమపదములేదు. మిక్కిలి చక్కనివగురామునియొక్క పాదములను సేవించెదను. నాకు రామునియందు స్థిరమగుప్రీతి యుండుఁగాక. ఓ శ్రీరామా! నన్ను పాలింపుము.

శ్లో. రామ మిందీవరశ్యామం రాజీవాయతలోచనమ్,
జ్యాఘోషనిర్జితారాతిం జానకీరమణం భజే. ౭౮

మ. ఘననీలోత్పలపత్రగాత్రు విలస♦త్కంజాతనేత్రుం ధరా
తనయారమ్యకళత్రుఁ గార్ముకమహా♦ధ్వానాపహృద్వైరిఁ గాం
చనచేలుం గరుణాలవాలు వినుత♦త్సాపాలు సద్భక్తపా
వనశీలున్ యశోవిశాలుని రఘు♦స్వామిం బ్రశంసించెదన్.

తా. నల్లఁగలువరేకులవలె నల్లనివాఁడును, తామరరేకులవలె విశాలములయిన కన్నులు గలవాఁడును, ధనుష్టంకారముచేతను జయింపఁబడిన శత్రువులుగలవాఁడును, జానకీభర్తయునగు శ్రీరాముని సేవించుచుండెదను.

శ్లో. నానాదివ్యాస్త్రతేజస్స్ఫురదమితభుజశ్శత్రుసంహారధీరః
కౌటిల్యోద్దీప్యమానభ్రుకుటియుతముఖం ధారయన్నంబుదాభః,
తూణీరప్రోత్థవేగోల్లసితశరవరైస్తాడయిత్వా దశాస్యం
వీరశ్రీబంధురాంగస్త్రిదశపతినుతః పాతు మాం వీరరామః. ౭౯

మ. కుటిలభ్రూకుటితాస్యుఁ డై కరలస♦త్కోదండదివ్యాస్త్రుఁ డై
చటులారిందముఁ డై బిడౌజనుతుఁ డై ♦ శ్యామాంగుఁ డై ధీరుఁ డై
పటుతూణీరవిముక్తకాండపవని♦ర్భగ్నాసురేంద్రాద్రి యై
కటువృత్తిం జయలక్ష్మిఁ గొన్న ధరణీ♦కాంతుండు నన్బ్రోవుతన్.

తా. అనేకవిధములయిన దివ్యాస్త్రముల తేజస్సుచేతను ప్రకాశించు గొప్ప బాహువులుగలవాఁడును, శత్రువులను సంహరించుటయందుఁ బండితుఁడును, శక్తి లక్ష్యముచేతను ప్రకాశించుచున్న కనుబొమలతోఁ గూడిన మొగమును ధరించువాఁడును, మేఘమువంటి కాంతిగలవాఁడును, అమ్ములపొదినుండి తీసినవేగముచేఁ ప్రకాశించు నుత్తమబాణములచేతను రావణుని జంపి వీరలక్ష్మిచే సాంద్రమయిన యవయవములుగలవాఁడును, ఇంద్రసన్నుతుండును అగువీరరాముఁడు నన్ను రక్షించుఁగాక.

శ్లో. హత్వా యుద్ధే దశాస్యం త్రిభువనవిషమం వామహస్తేన చాపం
భూమా విష్టభ్య తిష్ఠన్నితరకరధృతం భ్రామయన్ బాణమేకమ్,
ఆరక్తోపాంతనేత్రః శ్వరదళితవపుః కోటిసూర్యప్రకాశో
వీరశ్రీబంధురాంగస్త్రిదశపతినుతః పాతు మాం వీరరామః. ౮౦

మ. అరుణాంభోరుహనేత్రుఁడై శతసహస్రాదిత్యసంకాశుఁడై
సురలోకేంద్రమునీంద్రకంటకు దశాస్యున్ ద్రుంచి విభ్రాంతుఁడై
ధరణిన్ గార్ముకమూని బాణమొకచేతన్ ద్రిప్పుచున్ సన్నుతా
మరనాథుండు జయాభిరాముఁ డగురామస్వామి నన్ బ్రోవుతన్.

తా. ముల్లోకములకు విషముఁడయిన రావణుని యుద్ధమునందుఁ జంపి యెడమ చేతితో ధనుస్సును భూమియందు నిలిపి రెండవచేతఁ బట్టఁబడిన యొక బాణమును త్రిప్పుచు నిలువఁబడినవాఁడును, ఇంచుక యెఱ్ఱని ప్రాంతములుగల కన్నులుగలవాఁడును, రావణునిబాణములచే గాయపడినశరీరముగలవాఁడును, కోటిసూర్యులకాంతిని గలవాఁడును, వీరలక్ష్మిచే సాంద్రమయినయవయవములు గలవాఁడును, ఇంద్రసన్నుతుఁడును అగువీరరాముఁడు నన్నుఁ బాలించుఁగాక.

శ్లో. యుద్ధే సన్నద్ధశస్త్రం కపివరభయదం కుంభకర్ణం సురారిం
బాణేనైకేన సద్యః ప్రకటితహుతభుగ్జ్వాలరోషారుణాక్షమ్,
హత్వా కృత్వా ప్రమోదం సురకపినికరైర్జ్ఞానిబృందైకసేవ్యో
వీరశ్రీబంధురాంగస్త్రిదశపతినుతః పాతు మాం వీరరామః. ౮౧

చ. హరివరు లెల్ల భీతిల లయాంతకురీతి ధృతాస్త్రహస్తము
మ్మరుఁ డరుణాక్షుఁడైన ఘటకర్ణు వధించి జయాభిరాముఁడై
సురపతి వానరుల్ ముదముసొంపు వహింప మునుల్ భజింపఁగా
సురపతి సన్నుతింప రణశూరుఁడు రాముఁడు నన్నుఁ బ్రోవుతన్.

తా. శస్త్రసన్నద్ధుఁడును, వానరవీరులకు భయంకరుఁడును ప్రకటింపఁబడిన కోపాగ్నిచే నెల్లరియందలి కోపముచే నెఱ్ఱనయినకన్నులు గలవాఁడును అగు కుంభక

ఘ్నుఁడనెడి రాక్షసుని యుద్ధమునందుఁ దక్కాలమున, ఒక్కబాణముచేఁ జంపి, దేవత లకును వానరులకును సంతోషమును గలిగించి మునిసంఘములచేతను సేవింపఁబడినవాఁ డై వీరలక్ష్మిచే సాంద్రములయిన యానయనములుగలవాఁడై యింద్రసన్నుతుఁడై యుండువీరరాముఁడు నన్నుఁ బాలించుఁగాక.

శ్లో. దైతేయోదగ్రసైన్యం పటుతరవిశిఖం రావణం ఘోరనాదం
దేవేంద్రస్తూయమానస్స్ఫురదరినికరా నంధకారాంశ్చ హత్వా,
దిక్పాలాన్ప్రాప్తభోగాన్మణిరుచిసుభగాన్ దిక్షుతాన్స్థాపయిత్వా
వీరశ్రీబంధురాంగ స్త్రిదశపతినుతః పాతు మాం వీరరామః ౧౨

మ. భయదంబైనమహోర్భటిన్ ధృతధనుర్బాణాస్త్రుఁడై గర్వమ
గ్నయుఁడై దైత్యావళి వంచశాదిచటులాస్త్రశ్రేణియున్ ద్రుంచి తా
జయలక్ష్మిన్ గొని జంభవైరినుతుఁడై స్థానంబులన్ భోగముల్
జయ దిక్పాలుర కిచ్చినట్టిరఘునాథస్వామి నన్ బ్రోవుతన్.

తా. గొప్పరాక్షసులచే సేవింపఁబడువాఁడును, మిగుల పదునైనబాణ ములుగలవాఁడును, భయంకరమయిన ధ్వనిగలవాఁడును అగురావణుని, ప్రకాశిం చుచక్రముసమూహములనెడి యంధకారములను గొట్టి దేవేంద్రునిచేఁ గొనియాడఁబడు వాఁడును, పొందఁబడినభోగములుగలవారును, మణికాంతులచేఁ జక్కనివారును అగునాదిక్పాలురను వారివారిదిక్కులయందు స్థాపించి వీరలక్ష్మీబంధురాంగుఁడును అయినవీర రాముఁడు నన్నుఁ బాలించుఁగాక.

శ్లో. కౌసల్యావీరగర్భాంబుధిభువవిలసత్పూర్ణచంద్రప్రకాశో
మౌనీంద్రస్వాంతపద్మప్రవిమలతరణిర్ధర్మనైపుణ్యరూఢః,
మారీచం రాక్షసేంద్రం నిజశరదహనాయాహుతిం కల్పయిత్వా
వీరశ్రీబంధురాంగ స్త్రిదశపతినుతః పాతు మాం వీరరామః. ౧౩

శా. కౌసల్యాజఠరాబ్ధిచంద్రు మునిహృత్కంజాతకంజాప్తు వి
ద్యాసంపన్నునిఁ దాటకేయవనదావాగ్న్యంబకున్ వీరల
క్ష్మీసంప్రాప్తశరీరు ధర్మయుతసంశీలున్ బలారిస్తుతున్
రాసూనున్ రఘువీరు దాశరథి శ్రీరామున్ బ్రశంసించెదన్.

తా. కౌసల్యయొక్క వీరగర్భమనుసముద్రమునకు గొప్పగాఁ బ్రకాశించు పూర్ణచంద్రునివంటివాఁడును, మునివరులమనఃపద్మములకు సుఖాకరణమగు సూ ర్యుఁడును, ధర్మనైపుణ్యముచేఁ బ్రసిద్ధుఁడును, రాక్షసశ్రేష్ఠుఁడయినమారీచు ని తనబాణాగ్నికి ఆహుతిగాఁ గల్పించి వీరలక్ష్మీబంధురాంగుఁడై యింద్రసన్ను తుఁడును అయిన వీరరాముఁడు నన్ను రక్షించుఁగాక.

శ్లో. యోదండకారణ్యనిశాచరేంద్రాన్ కోదండలీలావిధుతాంశ్చకార
వేదండశుండాయితబాహుదండః కోదండపాణిః కులదైవతం నః.

మ. తతజంభద్విషహస్తిహస్తనిభదోర్దండాత్తకోదండము
న్డితుఁడై ఘోరత దండకాటవిని దాడిన్ జేయుచున్ ధూర్తసం
గతి వర్తించునిశాటులన్ దునిమి వేడ్కన్ బాణబాణాసనాం
చితుఁడౌ రాముఁడు మాకుదైవ మగుచున్ జిత్తంబునన్ శాంతమున్.

తా. ఏనుఁగుతొండమువంటి బాహుదండములుగల యేమహాత్ముఁడు దండకారణ్యమునందలి రాక్షసశ్రేష్ఠులను తనధనుర్విలాసమువలన విధూతులనుగాఁ జేసెనో అట్టి కోదండపాణి యగురాముఁడు మాకులదైవము.

శ్లో. తరుణౌ రూపసంపన్నౌ సుకుమారౌ మహాబలౌ,
పుండరీకవిశాలాక్షౌ చీరకృష్ణాజినాంబరౌ
ఫలమూలాశినౌ దాంతౌ తాపసౌ ధర్మచారిణౌ,
రక్షఃకులనిహంతారౌ భ్రాతరౌ రామలక్ష్మణౌ. ౮౨

చ. అనుపమరూపయౌవనబలాఢ్యుల సజ్జనమిత్రులన్ లస
ద్వనరుహపత్రనేత్రులను దాంతులఁ దాపసధర్మచర్యులన్
వనఫలమూలభోజనుల వల్కలధారుల దైత్యబృందమ
ర్దను లగురామలక్ష్మణుల దాసజనావనులన్ భజించెదన్.

తా. యౌవనావస్థలో నున్నవారును, రూపసంపన్నులును, సుకుమారులును, గొప్పబలముగలవారును, తామరరేకులవలె విశాలములయిన కన్నులుగలవారును, నార చీరలు, కృష్ణాజినములు వస్త్రములుగాఁ గలవారును, పండ్లు దుంపలు తినువారును, మనోనిగ్రహము గలవారును, తాపసులును, ధర్మచారులును, రాక్షసులసమూహము ను గొట్టినవారును, అన్నదమ్ములును అగురామలక్ష్మణులు నన్ను రక్షించెదరుగాక.

శ్లో. కల్యాణానాం నిధానం కలిమలమథనం పావనం పావనానాం
పాథేయం యన్ముముక్షోః సపది పరపదప్రాప్తయే ప్రస్థితస్య,
విశ్రామస్థానమేకం కవివరవచసాం జీవనం సజ్జనానాం
బీజం ధర్మద్రుమస్య ప్రభవతు భవతాం భూతయే రామనామ ౮౩

చ. పరమపవిత్రమున్ గుశలపద్ధతి కాదిమకారణంబు ని
ద్ధరఁ గలికల్మషాపహము ధర్మకుజంబున కాదిబీజమున్
బరమపదానువర్తి యగుపాంథున కిమ్మగునట్టివిశ్వాసము

ద్ధుఁడగునట్టి రాక్షసుని యుద్ధమునందుఁ దత్కాలమున, ఒక్కబాణముచేఁ జంపి, దేవతలకును వానరులకును సంతోషమును గలిగించి మునిసంఘములచేతను సేవింపఁబడినవాఁడై వీరలక్ష్మిచే సాంద్రములయిన యానందములుగలవాఁడై యింద్రసన్నుతుఁడై యుండు వీరరాముఁడు నన్నుఁ బాలించుఁగాక.

శ్లో. దైత్యేశోదాదగ్రసేవ్యం పటుతరవిశిఖం రావణం ఘోరనాదం
దేవేంద్రస్తోమయామావస్ఫురదరినికరా నంధకారాంశ్చహత్వా,
దిక్పాలాన్ప్రాప్తభోగాన్మణిరుచిసుభగాన్ దిక్షుతాన్ స్థాపయిత్వా
వీరశ్రీబంధురాంగ స్త్రిదశపతినుతః పాతు మాం వీరరామః. ౮౨

మ. భయదం బైనమహోత్కటిన్ ధృతధనుర్బాణాస్త్రుఁడై గర్వమ
గ్నయుఁడై తాన్యవళి వంచకాదిచటులా స్త్రీప్రక్రియన్ ద్రుంచి తా
జయలక్ష్మిన్ గొని జంభవైరినుతుఁడై స్థానంబులన్ భోగముల్
దయ దిక్పాలుర కిచ్చినట్టిరఘునాథస్వామి నన్ బ్రోవుతన్.

తా. గొప్పరాక్షసులచేఁ గొలువఁబడువాఁడును, మిగుల సమర్థములయిన బాణములుగలవాఁడును, భయంకరమయిన ధ్వనిగలవాఁడును అగురావణుని, ప్రకాశించు శస్త్రసమూహములుగొని యంధకారములను గొట్టి దేవేంద్రునిచేఁ గొనియాడఁబడువాఁడును, పొందఁబడినభోగములుగలవారును, మణికాంతులచేఁ జక్కనివారును అగుదిక్పాలురను వారివారిదిక్కులయందు స్థాపించి వీరలక్ష్మీబంధురాంగుఁడును అయినవీర రాముఁడు నన్నుఁ బాలించుఁగాక.

శ్లో. కౌసల్యావీరగర్భాంబుధిఘనవిలసత్పూర్ణచంద్రప్రకాశో
మౌనీంద్రస్వాంతపద్మప్రవిమలతరణిర్ధర్మ్యసైపుణ్యరూఢః,
మారీచం రాక్షసేంద్రం నిజశరదహనాయామహూతిం కల్పయిత్వా
వీరశ్రీబంధురాంగ స్త్రిదశపతినుతః పాతు మాం వీరరామః. ౮౩

శా. కౌసల్యాజఠరాబ్ధిచంద్రు, మునిహృత్పంకేజాతకంజాప్తు, వి
ద్యాసంపన్నునిఁ బాటలీయవనదాక్షిణ్యంబునన్ వీరల
క్ష్మీసంప్రాప్తశరీరు ధర్మ్యమతిసంశీలున్ బలారిస్తుతున్
రాసూనున్ రఘువీరు దాశరథి శ్రీరాముఁ బ్రశంసించెదన్.

తా. కౌసల్యయొక్క వీరగర్భమనుసముద్రమునకు గొప్పగాఁ బ్రకాశించు పూర్ణచంద్రునివంటివాఁడును, మునివరులమనఃపద్మములకు మేఘావరణములేని సూర్యుఁడును, ధర్మ్యసైపుణ్యముచేఁ బ్రసిద్ధుఁడును, రాక్షసశ్రేష్ఠుఁ డయినమారీచుని తనబాణాగ్నిలో ఆహుతిగాఁ గల్పించి వీరలక్ష్మీబంధురాంగుఁడై యింద్రసన్నుతుఁడును అయిన వీరరాముఁడు నన్ను రక్షించుఁగాక.

తా. వీరుఁడైనరాముఁడు సత్యముచే లోకములను, దానముచే దీనులను, శుశ్రూషచేతను గురువులను, ధనుస్సుచేతను యుద్ధరంగమునందలి శత్రువులను వశము చేసికొనుచుండెను. రామనామ యనుపవిత్రరత్నము సంసారబీజములను వేఁచునది. సుఖ సంపదలను తుడుచునది. యమదూతలను భయపెట్టునది.

శ్లో. సకృత్ప్రణతరక్షాయాం సాక్షీ యస్య విభీషణః,
సాపరాధప్రతీకార స్స శ్రీరామో గతి ర్మమ.
న జానే జానకీజానే రామ త్వన్నామవైభవమ్,
సర్వజ్ఞో భగవాన్ శంభు ర్వాల్మీకి ర్వేత్తి వా న వా. ౮౯

మ. అపరాధం బొనరించి యైన శరణం బన్నన్ గృపన్ బ్రోతు వీ
కృపకున్ సాక్షి విభీషణుం డగుట రిత్తే నీవు నీనామము వి
ల్లవుకున్ భర్గుఁడు వాములూరుభవుఁ డుల్లంబందుఁ జింతించి త
ద్విపులార్థంబు నెఱింగిరో యెఱుఁగరో వేద్యంబె నాకోటికిన్.

తా. ఒక్కసారియైనను నమస్కరించినవారిని రక్షించువిషయమున నెవ్వనికి విభీషణుఁడు సాక్షియో, అపరాధులకుఁ బ్రత్యుపకారముచేయు నా శ్రీరాముఁడు నాకు దిక్కు. సీతాపతీ! రామా! నీనామవైభవము నే నెఱుఁగను. సర్వజ్ఞుఁడైనశివభగవానుఁడును, వాల్మీకియు నెఱుఁగుదురో యెఱుఁగరో.

శ్లో. కృత్యాకృత్యవివేకహీనమనసాం హత్యాదిభిర్దీవినా
మత్యంతం లఘు తారకం తనుభృతామత్యంతశోకాపహమ్,
సత్యానందమయం సమస్తనిగమస్తుత్యం పరం సంపదాం
స్థానం శ్రీరఘురామనామ విమలం నిత్యం స్మరన్ ముచ్యతే. ౯౦

శా. కృత్యాకృత్యవివేకవర్జితులకున్ గించిద్ఘ్ను లైనట్టిగో
హత్యాప్రాప్తులకున్ సమస్తులకు మోక్షార్థంబు వేదాంతసం
స్తుత్యం బీప్సితసంపదాస్పదము నిశ్శోకంబు నైర్మల్యమున్
సత్యానందము రామసంస్మృతిమహాసౌఖ్యంబు మోక్షంబగున్.

తా. ఇది చేయఁదగినది-ఇది చేయరానిది యనువివేకము లేనిమనసులుగల వారును, హత్య మొదలగువానిచే జీవించువారును అగుమనుజాలకును మిక్కిలి తేలికఁ దారకమును, అత్యంతము శోకమును బోఁగొట్టునదియు, సత్యము-ఆనందము స్వరూపముగాఁగలదియు, ఎల్ల వేదముల స్తోత్రములకును స్థానమును, సంపదలకు నివాసస్థానమును, నిర్మలమును అగు శ్రీరఘురాముని నామమును సదా స్మరించువాఁడు ముక్తుఁ డగును.

ల్లఁజెందెడి రాక్షసుని యుద్ధమునందుఁ దత్కాలమున, ఒక్కబాణముచేఁ జంపి, దేవత
లకును వానరులకును సంతోషమును గలిగించి మునిసంఘములచేతను సేవింపఁబడినవాఁ
డై వీరలక్ష్మిచే పాండ్రములయిన యవయవములుగలవాఁడై యింద్రసన్నిభుఁడై
యుండువీరరాముఁడు నన్నుఁ బాలించుఁగాత.

శ్లో. దైతేయోదగ్రసేవ్యం పటుతరవిశిఖం రావణం ఘోరనాదం
దేవేంద్రస్తూయమానస్ఫురదరినికరా నంధకారాంశ్చ హత్వా,
దిక్పాలాన్ప్రాప్తభోగాన్మణిరుచిసుభగాన్ దిక్షు తాన్స్థాపయిత్వా
వీరశ్రీబంధురాంగ స్త్రిదశపతినుతః పాతు మాం వీరరామః. ౮౨

మ. భయదం బైనమహోర్భటిన్ ధృతధనుర్బాణాస్త్రుఁడై గర్వమ
గ్నయుఁడై దైత్యావళి వంచకాదిచటులారాత్రిప్రక్రియన్ ద్రుంచి తా
జయలక్ష్మిన్ గొని జంభవైరినుతుఁడై స్థానంబులన్ భోగముల్
దయ దిక్పాలుర కిచ్చినట్టిరఘువంశస్వామి నన్ బ్రోచుతన్.

టీ. గొప్పరాక్షసులచే సేవింపఁబడువాఁడును, మిగుల సమర్థములయిన బాణ
ములుఁగలవాఁడును, భయంకరమయిన ధ్వనిగలవాఁడును అగురావణుని, ప్రకాశిం
చుశత్రుసమూహములగుచీఁ యంధకారములను గొట్టి దేవేంద్రునిచేఁ గొనియాడఁబడు
వాఁడును, పొందఁబడినభోగములుఁగలవారును, మణికాంతులచేఁ జక్కనివారును
అగునాదిక్పాలురను వారివారిదిక్కులయందు స్థాపించి వీరలక్ష్మిబంధురాంగుఁడును
అయినవీర రాముఁడు నన్నుఁ బాలించుఁగాత.

శ్లో. కౌసల్యావీరగర్భాంబుధివిలసత్పూర్ణచంద్రప్రకాశో
మౌనీంద్రస్వాంతపద్మప్రవిమలతరణిర్ధన్వనైపుణ్యరూపః,
మారీచం రాక్షసేంద్రం నిజశరదహనాయాహుతిం కల్పయిత్వా
వీరశ్రీబంధురాంగ స్త్రిదశపతినుతః పాతు మాం వీరరామః. ౮౩

శా. కౌసల్యాజఠరాబ్ధిచంద్రు మునిహృత్పంకేజాతప్రభాపూ వి
ద్యాసంపన్నునిఁ దాటకేయవనదావాగ్న్యంబకున్ వీరల
క్ష్మీసంప్రాప్తశరీరు ధర్మయుతసంశీలున్ బలారిస్తుత
రాసూనున్ రఘువీరు దాశరథి శ్రీరామున్ బ్రశంసించెదన్.

టీ. కౌసల్యయొక్క వీరగర్భ మనుసముద్రమునకు గొప్పగాఁ బ్రకాశించు
పూర్ణచంద్రునివంటివాఁడును, మునివరులమనఃపద్మములకు మేఘావరణములేని సూ
ర్యుఁడును, ధనుర్విద్యానైపుణ్యముచేఁ ప్రసిద్ధుఁడును, రాక్షసశ్రేష్ఠుఁ డయినమారీచు
ని తనబాణాగ్నికి ఆహుతిగాఁ గల్పించి వీరలక్ష్మీబంధురాంగుఁడై యింద్రసన్ను
తుఁడును అయిన వీరరాముఁడు నన్ను రక్షించుఁగాత.

భర్తాభయప్రాపికరారవిందాం,
దేవీం భజే రాఘవవల్లభాం తామ్. ౯౩

చ. అనుపమరామభామినిక • దానవపంకజ సూత్నరత్నకాం
చనవనూపురాంఘ్రినవ • సారసయుగ్మ నిజాశ్రితేష్టదా
యినవకరాంబుజాత మిథి • లేశ్వరపుత్త్రిని రామదేవి న
మ్మనమున నిష్టసిద్ధికి స • మాహితబుద్ధిఁ దలంతు నెప్పుడున్.

తా. రత్నములయందెలతోడి పాదపద్మములుగలదియు, రాముఁడనెడిసూర్యుని వలన వికసించిన ముఖపద్మముగలదియు, భక్తుల కభయమును గలిగించుకరపద్మము గలదియు, రామునిప్రియురాలును, అగుసీతను సేవించెదను.

శ్లో. జయతు విజయకారీ జానకీమోదకారీ
తపనకులవిహారీ దండకారణ్యచారీ,
దశవదనకుఠారీ దైత్యవిచ్ఛేదకారీ
మణిముకుటకధారీ చండకోదండధారీ. ౯౪

ఉ. ధారుణిజాసుతోషకరుఁ • డామరసాత్త్రకులప్రదీపకుఁ
ఘోరనిశాచరాంబుదమహా • కుంజరు డచ్యుతు దండకాటవీ
చారుతరప్రచారు ధృత • చాపు దశాననమర్దనుఁ మణి
స్ఫారకిరీటధారి రఘు • సత్తము నుర్వి జయంబు పొందెడున్.

తా. విజయమును గలిగించువాఁడును, సీతకు సంతసమును గలిగించువాఁడును, సూర్యవంశమున విహరించినవాఁడును, దండకారణ్యములో సంచరించినవాఁడును, రావణుని ఛేదించుకుఠారమును, రాక్షసులను ఛేదించినవాఁడును, రత్నకిరీటమును ధరించువాఁడును, భయంకరమయినధనుస్సును ధరించువాఁడును, అగురాముఁడు జయించుఁగాక.

శ్లో. చేతఃస్థితం చింతకచింతనీయం చింతాహరం చింతితపారిజాతమ్,
అచింతనీయంబహుచింతయేఽహంతమేవరామంభువనాభిరామమ్.

మ. సకలాత్మస్థితు సర్వచింతితుని దా • సప్రాంగణప్రాంతక
ల్పకముఁ శౌరి నచింత్యు నచ్యుతుఁ బర • బ్రహ్మంబుఁ జింతాహరుఁ
బ్రకటానందకరుఁ బరాత్పరుఁ బరుఁ • రాముఁ ఘనశ్యాముఁ దా
రకనాముఁ రవికోటిధాము మది న • శ్రాంతంబుఁ జింతించెదన్.

తా. నాచిత్తమునందున్నవాఁడును, చింతించువారిచేఁ జింతింపఁదగువాఁ

డును, చింతలను హరించువాఁడును, కోరికలకుఁ గల్పవృక్షమును, ఆలోచింపరాని వాఁడును, లోకములకునాధారుఁడును, అగుశ్రీరాముని నే నెంతయుఁ జింతించెదను.

శ్లో. సాకేతే శరదిందుకుందధవళే సౌధే మహామంటపే
పర్యస్తాగరుధూపధూమపటలే కర్పూరదీపోజ్జ్వలే,
సుగ్రీవాంగదవాయుపుత్రసహితం సౌమిత్రిణా సేవితం
లీలామానుషవిగ్రహం రఘుపతిం రామం భజే శ్యామలమ్. ౬౭

మ. ఘనసాకేతమునందుఁ గుందనుమరాకాచంద్రదీప్తంబు వా
సనలన్ మిన్నగుధూపధూమనిబిడాచ్ఛాదంబు కర్పూరదీ
పనిరూఢం బగుసౌధమంటపమునన్ భ్రాతల్ కపుల్ గొల్వ మిం
చినలీలామనుజాకృతిం బరఁగు నాశ్రీరాముఁ జింతించెదన్.

తా. అయోధ్యలో, శరచ్చంద్రునివలెను మల్లెపూవులవలెను తెల్లనైనమేడ యందు, అంతటను వ్యాపించిన- అగురుధూపపుఁ బొగగలదియు, కర్పూరదీపముల చేఁ బ్రకాశించునదియునగు గొప్పమండపముపైని సుగ్రీవ- అంగద- ఆంజనేయసహితుఁడై, లక్ష్మణునిచే సేవింపఁబడువాఁడును, లీలామానుషశరీరుఁడును, రఘువంశపాలకుండును, నల్లనివాఁడును అగురాముని సేవించుచుందును.

శ్లో. రామః పితా రాఘవ ఏవ మాతా
రామో సుబంధుశ్చ సఖా హితశ్చ,
రామో గురుశ్చ పరమం చ దైవం
రామం వినా నాన్య మహం స్మరామి. ౬౮

ఉ. రాముఁడు తండ్రి మజ్జనని రాముఁడె బంధుఁడు రామచంద్రుఁడే
రాముఁడు మిత్రుఁడున్ గురుఁడు రాఘవుఁడే పరదైవతం బగున్
రాముఁడె మాకు దిక్కెపుడు రాముని గొల్చెద సంతతంబు శ్రీ
రాముని దప్ప నన్యుల నిరంతర మెంచి తలంచ నెమ్మదిన్.

తా. రాముఁడు నాకుఁ దండ్రి. రాముఁడే నాకుఁ దల్లి. రాముఁడే నాకుఁ మంచిబంధుఁడును, స్నేహితుండును, హితుఁడును. రాముఁడే నాకు గురువు, పరదేవతయును. రాముని విడిచి నే నితరదేవతలను స్మరింపను.

శ్లో. యా కృపా మునిసంత్రాణే యా కృపా కపినాయకే,
యా విభీషణరక్షాయాం సా రామ మయి ధీయతామ్. ౬౯

ఉ. ఏదయచేతఁ దాపసుల నేలితొ వానరశేఖరాళిపై
నేదయ గల్గి యుండెనొ రహిన్ దశకంధరసోదరావనం

చేదయుచేత నయ్యె నను ♦ నెవ్వఁడు నాదయఁ బ్రోవుమయ్య దా
మోదర రామ రాఘవ స♦ముజ్జ్వలభూషణ భక్తపోషణా.

తా. రామా! మునులను రక్షించుటయందున నీకెదయగలదో, సుగ్రీవునియం దేదయగలదో, విభీషణుని రక్షణయం దేదయగలదో, అదయ నాయం దుంచుము.

శ్లో. దయానిధే రాఘవ రామచంద్ర
నిరస్య పాపాని మమాఖిలాని,
త్వయ్యేవ భక్తిం సుదృఢాం ప్రయచ్ఛ
సైవ ప్రసూతే హ్యఖిలా నభీష్టాన్. ౯౯

చ. ప్రకటదయానిధీ వరద ♦ రాఘవ రామ మదీయకల్మష
ప్రకరము లెల్లఁ బాపి తమ♦పాదసరోజములందు భక్తి మా
మకహృదయంబునందు ననుమానము లేక యొసంగుమయ్య నీ
వఖిల కభీష్టసంపద ల♦వారిగ సంభవ మందు దానసే.

తా. దయానిధీ! రాఘవా! రామచంద్రా! నాపాపముల నన్నిటిని తొలఁగించి నీయందే స్థిరమైనభక్తిని కలిగించుము. అదియే యెల్లకోరికలను ప్రసవించును. (తీర్చును.)

శ్లో. అక్షీణబాణతూణీరస్సమారోపితకార్ముకః,
దశగ్రీవశిరోహంతా శ్రీరామ శ్శరణం మమ.
శ్రీరామ మే త్వం హి పితా చ మాతా
శ్రీరామ మే త్వం హి సుహృచ్చ బంధుః,
శ్రీరామ మే త్వం హి గురుశ్చ గోష్ఠీ
శ్రీరామ మే త్వం హి సమస్తమేవ. ౧౦౦

ఉ. అక్షయబాణతూణధరుఁ ♦ డై గుణరావము పిక్కటిల్లఁగా
రాక్షసరాడ్శిరంబులఁ గ♦ఱక్కునఁ ద్రుంచిన నీవె దిక్కు సం
రక్షకుఁడు న్గురుండును వ♦రప్రదుఁ డంబయుఁ దండ్రి తాతయుం
బక్షము భ్రాతయున్ సఖుఁడు ♦ బంధుఁడు సర్వము నీవె రాఘవా.

తా తఱుఁగనిబాణములతోడియమ్ములపొదులుఁగలవాఁడును, ఎక్కుడినధనుస్సు గలవాఁడును, రావణునిశిరస్సులను గొట్టినవాఁడును అగురాముఁడే నాకుదిక్కు. ఓరామా! నీవే నాకుఁ దండ్రివి, తల్లివి, ఓరామా! నాకుస్నేహితుండవు, బంధుఁడవు రామా! నీవే నాకు గురుఁడవును, గోష్ఠియు. రామా! నాకుసర్వస్వమును నీవేసుమా.

శ్లో. పటుతరజలవాహధ్వాన మాదాయ చాపం
పవనజవనమేకం బాణ మాకృష్య తూణాత్,
అభయవచనదాయీ సానుజ స్సర్వతో మే
రణహతదనుజేంద్రో రామచంద్ర స్సహాయః. ౧౦౧

మ. జలధిధ్వానసమానఘోరనినద♦జ్యాయుక్తచాపంబునన్
జ్వలనాప్రోజ్జ్వలవేగబాణము వడిన్ ♦ సంధించి దృష్టించి దో
ర్బలుఁ బౌలస్త్యు వధించి నిర్భయులఁగా ♦ భక్తాళిఁ గావించి దా
పల సౌమిత్రి చెలంగఁ జెన్నగురఘు♦స్వామే సహాయుం డగున్.

తా. మిక్కిలిసమర్థమయిన మేఘముయొక్క ధ్వనివంటిధ్వనిగల ధనుస్సును పట్టుకొని, వాయువేగముగల-ఒకబాణమును తూణీరమునుండి తీసి, యుద్ధములో రావణుని జంపిన రామచంద్రుఁడు తమ్మునితోఁ గూడినవాఁడై, అభయవాక్యము నిచ్చుచు నా కంతటను సాయపడును.

శ్లో. కౌసల్యాలసదాలవాలజనిత స్సీతాలతాలింగిత
స్సిక్తః పఙ్క్తిరథేన సోదరమహాశాఖాభి రత్యున్నతః,
రక్ష స్తీక్ష్ణనిదాఘపాటనపటుచ్ఛాయాభి రానందయ
న్నస్మద్వాంఛితసత్ఫలాని ఫలతు శ్రీరామకల్పద్రుమః. ౧౦౨

శా. కౌసల్యాలసదాలవాలము ధరా♦కన్యాలతాయుక్తముం
దా సాసక్తము వాజిపోషితము సో♦దర్యప్రశాఖంబు ర
క్షస్సత్రాసనిదాఘతప్తజనర♦క్షాదక్షచ్ఛా
యాసంపన్నము రామకల్పతరు వి♦ష్టార్థంబు మా కీవుతన్.

తా. కౌసల్యయనెడి ప్రకాశించుపాదులోఁ బుట్టినదియు, సీతయనెడిలతచే నాలింగింపఁబడినదియు, దశరథునిచేఁ దడుపఁబడినదియు, సోదరులనెడి గొప్పశాఖలచే మిగుల నున్నతమయినదియు, రాక్షసులనెడి భయంకరమయినవేసవిని పోఁగొట్టఁ జాలిననీడలచే లోకముల నానందింపఁజేసినదియు, నగు శ్రీరాముఁ డనెడికల్పవృక్షము మాకోరిన మంచిఫలములను ఫలించుచుండును గాక.

శ్లో. గగనశిఖరరత్నం నిత్యమాకాశ్యరత్నం
జనమతనృపరత్నం జానకీరూపరత్నమ్,
భువనవలయరత్నం భూభుజా మేకరత్నం
రఘుకులవరరత్నం పాతు మాం రామరత్నమ్. ౧౦౩

మ. నిగమాంతోజ్జ్వలరత్న మార్యనుతమాణిక్యంబు సీతాసతీ
సగుణప్రాంచితరత్న మర్కకులభాస్వద్దివ్యసద్రత్నముఁ
జగదత్యద్భుతరత్నముఁ సకలరాజస్థానరత్నంబు స
ర్వగతం బారఘురామరత్నము ననుఁ రక్షించు నశ్రాంతముఁ

తా. ఉపనిషత్తులయందలి రత్నమును, నిత్యమును గోరఁదగిన రత్నమును జనులచేఁ బొగడఁబడు రాజరత్నమును, జానకీరూపరత్నమును, లోకములనెడి కో యమునందలిరత్నమును, రాజులలో ముఖ్యరత్నమును, రఘువంశములో మంచిరత్నమును అగురామరత్నము నన్నుఁ బాలించుచుండుఁగాక.

శ్లో. విశాలనేత్రం పరిపూర్ణగాత్రం సీతాకళత్రం సురవైరిజైత్రమ్,
కారుణ్యపాత్రం జగతఃపవిత్రం శ్రీరామరత్నం ప్రణతోఽస్మి నిత్యమ్

చ. వికసితపుండరీకదళవిస్తృతనేత్రు సురారిజైత్రు సే
వకనుతిపాత్రు నీలఘనవాసరత్నవిరాజిగాత్రుఁ దా
రకుఁ గమలాకళత్రుఁ ద్రిపురప్రకటాసురజైత్రు మిత్రునిఁ
సకలజగత్పవిత్రు రఘుసత్తమరత్నము నాశ్రయించెదఁ. ౧౦౪

తా. పెద్దకన్నులు గలవాఁడును, నిండారిన శరీరముగలవాఁడును, సీతభార్యగాఁగలవాఁడును, రాక్షసులను జయించినవాఁడును, దయకు స్థానమును, లోకపావనుఁడును, అగు శ్రీరాముఁ డనెడిరత్నమును నిత్యమును నమస్కరించుచుండెదను.

శ్లో. శ్రీరామచంద్ర శ్శ్రితపారిజాత స్సమస్తకల్యాణగుణాభిరామః,
సీతాముఖాంభోరుహచంచరీకో నిరంతరం మంగళ మాతనోతు.
ఇందీవరదళశ్యామః పుండరీకనిభేక్షణః,
ధృతకోదండతూణీరో రామ ఏవ గతి ర్మమ. ౧౦౫

మ. శ్రితమందారము సర్వశోభనగుణశ్రీరాముఁ డానందమం
దితసీతావదనాబ్జషట్పదము రాజీవాయతాక్షుండు మా
నితతూణీరధనుర్ధరుండుఁ బరుఁడుఁ నీలోత్పలాంభోదశో
భితుఁ డౌ రాముఁడుమాకు దిక్కయిశుభంబీనిచ్చు లిచ్చుంగృపన్.

తా. ఆశ్రితులకుఁ గల్పవృక్షమును, సకలమయిన మంచిగుణములచేతను మనోహరుఁడును, సీతముఖమనెడి పద్మమునందలి తుమ్మెదయును, అగు శ్రీరామచంద్రుఁడు మాకెల్లప్పుడును శుభములను వృద్ధిఁబొందించుఁగాక. నల్లఁగలువరేకులవలె నల్లనివాఁడును, పుండరీకములవంటి కన్నులుగలవాఁడును, ధనుస్సును- అమ్ములపొదులను ధరించువాఁడును అగురాముఁడే నాకు దిక్కు.

శ్లో. ఇచ్ఛ్వాకూణాం హి మహాబాహుం రఘువీరం మహాబలమ్,
గజేన మహతా౽౽యాంతం రామం ఛత్రావృతాననమ్. ౧౦౭

మ. అనయంబుం గతి నీవె యంచు మతిమోహభ్రాంతి నొందించు నా
ఘనబాహాబలుఁ బుండరీకధరు మేఘశ్యాము నాజానుబా
హు నగాత్యున్నతనాగరాడ్గమను సర్వోత్కృష్టు రాముం గనం
దనగమ్యుం రఘువీరు నే నెదుట సందర్శింతు హర్షంబునన్.

తా. ఆజానుబాహుఁడును, రఘువీరుఁడును, మహాబలుఁడును, గొప్పదియగు యేనుఁగుచేతను (ఏనుఁగునెక్కి) వచ్చుచుండువాఁడును, గొడుగుచే నావరింపఁబడిన మొగము గలవాఁడును అగురాముని జూడఁగోరుచున్నాను.

శ్లో. రామో నామ బభూవ హుం తదబలా సీతేతి హుం తౌ పితు
ర్వాచా పంచవటీవనే విహరత స్తా మాహర ద్రావణః,
నిద్రార్థం జననీకథామితి హరే ర్హుంకారత శ్శృణ్వత
స్సౌమిత్రే! క్వ ధనుర్ధనుర్ధనురితి వ్యగ్రా గిరః పాంతు నః. ౧౦౮

మ. తనయుం నిద్దురఁబుచ్చి తల్లి వలికెఁ ధాత్రీస్థలిం రాఘవుం
డనఁ జెన్నొంది సభార్యుఁగా దశరథుం డంపం వనిం జేర సీ
తను గొంపోయె దశాస్యుఁ డన్న వినినంతం వ్యగ్రుఁడై లక్ష్మణా
ధనువుం దెమ్మనుబాలరామునివటూక్తంబుల్ మనుం బ్రోవుతన్.

తా. రాముఁ డనునొకఁ డుండెడివాఁడు, ఊఁ. అతనిభార్య సీత- ఆదంపతులు దశరథునిమాటచేతను పంచవటీవనమున విహరించుచుండిరి, రావణుఁడా సీత నపహరించెను. అనియిట్లు నిద్రపోవుటకై తల్లి చెప్పుచున్నకథను హుంకారముతో వినుచు "లక్ష్మణా! ధను స్సెక్కడ ధను స్సెక్కడా?" అనువిష్ణురూపుఁ డగురాముని తొందరతోఁ గూడినమాటలు మమ్ములను రక్షించుఁగాక.

శ్లో. శ్రీరాఘవేతి వరదేతి దయాపరేతి
భక్తప్రియేతి భవబంధనమోచనేతి,
నాథేతి నాగశయనేతి సదా స్తువంతం
మాం పాహి భీతి మనిశం కృపణం కృపాళో! ౧౦౯

చ. హరి రఘురామచంద్రుఁడు దయాపరుఁ డాశ్రితవత్సలుండు దు
స్తరభవబంధమోచనుఁడు సర్పశయానుఁడు విశ్వనాథుఁ డం

చరసి నిరంతరంబు హృదయంబున నెంచఁగ నెంతవాఁడ దు
ష్కారుఁడను లుబ్ధుఁడఁగ దురితకర్ముఁడఁ బ్రోవుము రామరాఘవా

తా. శ్రీరాఘవా! అనియు, వరదా! అనియు, భక్తప్రియా! అనియు, సంసారబంధములు విడిపించువాఁడా! అనియు, నాథా! అనియు, కరుణయనా! అనియు, ఎల్లప్పుడును, నిన్ను స్తుతిచేయువాఁడను, భయంబడినవాఁడను, దీనుఁడను అగు నన్ను దయాళుఁడా! శ్రీరామా! రక్షించుము.

శ్లో. రామచంద్రచరితామృతపానం సోమపానశతకోటిసమానమ్,
సోమపానశతకోటిభిరీయా జ్జన్మ నైతి రఘునాయకనామ్నా. ౧౦౯

చ. అరయఁగ రామచంద్రచరితామృతపానసమాన మై తగుఁ
గురుతరసోమపానశతకోటులు తద్విధసోమపానని
ర్భరులకు జన్మముల్ గలవు రామసమాఖ్య నిరంతరంబు ను
స్థిరత జపించువారలకుఁ జేకుఱనేరవు జన్మకర్మముల్.

తా. శ్రీరామచంద్రునిచరిత్ర మనెడియమృతమును ద్రాగుట నూఱుకోట్లపర్యాయములు సోమపానముచేయుటతో సమానము. ఎన్నిసార్లు సోమపానము చేసినవాఁడును పుట్టును. రఘురామునినామమును పానముచేసినవాఁడు మరలఁ బుట్టఁడు.

శ్లో. రామ రామ దయాసింధో రావణారే జగత్పతే,
త్వత్పాదకమలాసక్తిర్భవే జ్జన్మని జన్మని. ౧౧౦

చ. హరిహరి రామరామ కరుణాంబునిధీ జగదేకనాథ దా
శరథి దశాననాద్రికులిశాయుధ నా దగువిన్నపంబు సా
దరమునఁ జిత్తగించి క్రమతఁ భువి జన్మము లెన్ని గల్గినఁ
సరసభవత్పదాంబుజరజఃకణసేవ లభింపఁజేయుమా.

తా. రామా! రామా! దయాసముద్రా! రావణశత్రూ! లోకపాలకా! నాకుఁ ప్రతిజన్మమునందును నీపాదపద్మములయం దాసక్తి కలుగుఁగాక.

శ్లో. శ్రీరాఘవం రామచంద్రం రావణారిం రమాపతిమ్,
రాజీవలోచనం రామం తం వందే రఘునాయకమ్. ౧౧౧

ఉ. శ్రీరఘురామచంద్రునకు శ్రీకరమూర్తికి రావణారికిన్
శ్రీరమణీమణీపతికి సేవితయోగిహృదబ్జవాసికిన్
సారసపత్రనేత్రునకు సన్నుతమానిసుపర్వకోటికిన్
శౌరికి రాఘవేంద్రునకు సంతత మేను నమస్కరించెదన్.

తా. శ్రీరాఘవుఁడును, రావణవిరోధియు, లక్ష్మీపతియు, తామరలవంటి కన్నులుగలవాఁడును, రఘునాయకుఁడును, అగు నా రాముని బ్రోచుకొనెదను.

శ్లో. యత్పాదపంకజరజశ్శ్రుతిభి ర్విమృగ్యం
యన్నాభిపంకజభవః కమలాసనశ్చ,
యన్నామసారరసికో భగవాన్ పురారి
స్తం రామచంద్ర మనిశం హృది భావయామి. ౧౧౨

ఉ. ఎవ్వనిపాదపద్మరజ మెల్ల శ్రుతుల్ వెదకంగఁ జాలవిం
కెవ్వనినాభికంజమున నేర్పడ సంభవమొందె గీర్వరుం
డెవ్వనినామసారము భజించి బుధాగ్రణి యయ్యె శంకరుం
డవ్విభు రామభూధవు నహర్నిశమున్ మది సంస్మరించెదన్.

తా. ఎవనిపాదపద్మములపరాగము వేదములచే వెదకఁదగినదో, బ్రహ్మ యెవని నాభిపద్మమునందుఁ బుట్టినవాఁడో, భగవంతుఁడగు శంకరుఁ డెవ్వనినామమునందలి సారము నొక్కటిచే తెలిసినవాఁడో వానిని రామచంద్రుని యెల్లప్పుడును హృదయమున భావించుచుందును.

శ్లో. యస్యావతారచరితాని విరించిలోకే
గాయంతి నారదముఖా భవపద్మజాద్యాః,
ఆనందజాశ్రుపరిషిక్తకుచాగ్రసీమా
వాగీశ్వరీ చ తమహం శరణం ప్రపద్యే. ౧౧౩

మ. ప్రకటంబై నవిరించిలోకమున నేభవ్యాత్మదివ్యావతా
రకథల్ కీర్తనఁ జేతు రబ్జభవశర్వాణీశముఖ్యామర
ప్రకరం బార్యులు నారదాదులును గీర్వాణీమాతయు నానందబా
ష్పకణార్ద్రస్తనయై స్మరించు నప్రభు నాత్మన్ సేవించెదన్.

తా. ఎవనియవతారచరిత్రములను బ్రహ్మలోకమున నారదాదులును, శివబ్రహ్మాదులును, ఆనందమువలనఁ గలిగినకన్నీటిచేఁ దడిసిన స్తనాగ్రము గలదియై సరస్వతియును పాడుచుందురో ఆరాముని నేను శరణుపొందెదను.

శ్లో. జాతిభ్రష్టోఽతిపాపీ పరధనపరదారేషు నిత్యోద్యతో వా
స్తేయీ బ్రహ్మఘ్నమాతాపితృవధనిరతో యోగిబృందాపకారీ,
ధేయం కర్ణామృతం యః పఠతి హి సతతం రామచంద్రస్య భక్తో
యోగీంద్రైరప్యలభ్యం పదమపి లభతే సర్వదేవైశ్చ సేవ్యమ్. ౧౧౪

మ. పరభామాపరవిత్తసంగ్రహుఁడు వి♦ప్రఘ్నుండు చోరుండు దు
స్తరపాపాత్ముఁడు మాతృపిత్రహుఁడు వం♦శభ్రష్టుఁ డార్యోత్తమా
త్కారనిందాస్పదుఁ డైనఁబో నియతుఁడై ♦ కర్ణామృతంబుం బఠిం
పరహి౯ యోగుల కందరానిపదముం ♦ బ్రాపించు గాఢంబుగాన్.

తా. జాతినుండి బహిష్కరింపఁబడినవాఁ డయినను, మిక్కిలి పాపాత్ముఁడైనను, పరులధనమునందును పరస్త్రీలయందును నిత్యాసక్తుఁడైనను, దొంగయైనను, బ్రహ్మహత్యచేసినవాఁడైనను, తలిదండ్రులను చంపుటయం దాసక్తుఁడైనను, యోగుల సమూహమున కపకారము చేయువాఁడైనను, శ్రీరామచంద్రునకు భక్తుఁడై యొకఁడు ధ్యానము చేయఁదగిన రామకర్ణామృతమును సదా పఠించుచుండునో, వాఁడు యోగీంద్రులచే సయితము పొందరానిదియు, ఎల్లదేవతలచేతను సేవింపఁదగినదియునగు స్థాన (మోక్ష) మును పొందును.

మ. శివసామ్యుం డగునాదిశంకరులు ము౯ ♦ శ్రీరామకర్ణామృతం
బవని౯ సంస్కృత మొప్పరించ నది మా♦తోపేక్షఁ జేకూరివం
శవరాబ్ధీందుప్రసిద్ధసిద్ధకవి సే♦ శ్రద్ధం దెనింగించి రా
ఘువ పూదండగ నిచ్చినాఁడఁ గొను మా♦కల్పంబుగా సత్కృపన్.

మాలిని. వనదనిభశరీరా ♦ వర్ణితామర్త్యవారా
కనకశిఖరిధీరా ♦ కంధిగర్వాపహారా
దనుజఘనసమీరా ♦ ధాత్రిజాచిత్తచోరా
మునిజనమనిచారా ♦ మోక్షలక్ష్మీవిహారా.

మ. ఇది శ్రీరామపదారవిందమకరం♦దేచ్ఛాతిసక్తత్వమ
త్పదవిజ్ఞానపదాబ్జరేణుపటల♦ప్రాప్తోత్తమాంగోల్లస
న్మదిశాంతఃకరణుండు సిద్ధకవి మా♦న్యుం డైనరామావనీ
శదయాలోకనఁ జెప్పె మూఁడవది యా♦శ్వాసం బభీష్టాప్తికిన్.

---

# చతుర్థాశ్వాసము.

—❖❖❖❖—

శ్లో. శ్రీరామం జనకాత్మజాకుచతటీశ్రీగంధపంకోల్లస
ద్వక్షోవీథి ముదార మాశ్రితమునిప్రాదుర్భవత్కల్పకమ్,
బ్రహ్మేశానముఖామరస్తుత మజం బ్రహ్మాండభాండాధిపం
వందే కోసలకన్యకాసుత మహం వారాశిగర్వాపహమ్. ౧

శా. శ్రీసీతాకుచకుంభచర్చితలసచ్ఛ్రీచందనాలంకృతుఁ
గౌసల్యాత్మజు మానికల్పకము శ్రీకంఠాబ్జభూముఖ్యగో
దాసస్తోత్రు సముద్రగర్వహాననుఁ బ్రహ్మాండభాండాధిపుఁ
రాసూనుఁ బరమాత్ము జన్మరహితుఁ రామప్రభుఁ గొల్చెదన్.

తా. సీత స్తనమండలమునయందలి చందనపంకముచేఁ బ్రకాశించుచున్న వక్షఃప్రదేశము గలవాఁడును, గొప్పవాఁడును, ఆశ్రితులయినమునులకు సాక్షాత్కరించు కల్పవృక్షమును, బ్రహ్మ-ఈశ్వరుఁడు మొదలయినదేవతలచే స్తోత్రముచేయఁబడువాఁడును, పుట్టుకలేనివాఁడును, కుండలవంటి అనంతకోట్లుసంఖ్యగల బ్రహ్మాండములకుఁ బ్రభువును, కౌసల్యకొడుకును, సముద్రునిగర్వము నణఁచినవాఁడును అగు శ్రీరాముని నమస్కరించుచుండెదను.

శ్లో. సాకేతే మణినిర్మితే ప్రవిలసత్సౌధాయుతైరావృతే
అంతర్గేహ మతీతభానునిలయే చంచత్ప్రకాశోజ్జ్వలే,
హార్మ్యే భర్మమయే ఘనాఘనరవైర్ఘంటాశతైర్నాదితే
డోలాతల్పవిహారిణం రఘుపతిం సీతాసమేతం భజే. ౨

మ. తతప్రత్యగ్రమణీశలాయుతలసత్సౌధప్రతానోపశో
భితసాకేతమునన్ బతాకయుతమై పెంపొందునంతర్గృహ
స్థితచామీకరఘంటికారవయుతక్రీడోలికాశయ్యపై
క్షితిపుత్రీయుతకేళిఁ జెన్నలరు నా శ్రీరాము సేవించెదన్.

తా. అయోధ్యలో, రత్నములచే నిర్మింపఁబడినదియు, ప్రకాశించుచున్న వేల కొలఁది మేడలచే నావరింపఁబడినదియు, సూర్యమండలము నతిక్రమించినదియు, ఒప్పుచుండెడి కెంపులచేఁ బ్రకాశించునదియు, మేఘధ్వనులచేతను, వందలకొలఁది

ఘంటలచేతను ధ్వని చేయఁబడినదియు, బంగారుమయమును అగు కేంపయందలిలోపలి యింట సీతాసమేతుఁడై ఉద్యానవనములందు విహరించు రఘురాముని సేవించెదను

శ్లో. సాకేతే సౌధబద్ధధ్వజశతమహితే రాజమార్గే విశాలే
ఘంటారావైరుపేతే కనకమయయుతే గంధనాగే వసంతమ్,
దివ్యాకల్పోజ్జ్వలాంగం రథగజతురగై రావృతం సుప్రసన్నం
రామం శ్వేతాతపత్రావృతముఖకమలం చింతయా మ్యంతరంగే.

మ. సరసం బై శతకోటికేతనలస♦త్సౌధాళిసాకేతన
త్పురఘంటాపథమార్గమందున మణీ♦భూషాంచితుం డై యుల్లం
కరణేశేంద్రము నెక్కి నైజచతురం♦గంబుల్ ప్రవేష్టింప వి
స్ఫురితచ్ఛత్రసముజ్జ్వలుం డగునరా♦ముఁ గొల్తు నాత్మస్థితున్.

తా. అయోధ్యలో మేడలయందుఁ గట్టఁబడిన పెక్కుజెండాలతో నొప్పుచుండెడిదియు, విశాలమును అగు రాజమార్గమునందు, ఘంటాధ్వనులతోఁ గూడినదియు, బంగారపుబొడాలతోఁ గూడినదియు, అగు మదపుటేనుఁగుపైఁ గూర్చున్నవాఁడును. దివ్యభూషలయిన నగలచేఁ బ్రకాశించు నవయవములు గలవాఁడును, రథములచేతను, ఏనుఁగులచేతను, గుఱ్ఱములచేతను ఆవరింపఁబడినవాఁడును, మిగులఁ బ్రసన్నుఁడును, తెల్లని గొడుగుచే నావరింపఁబడిన ముఖపద్మముగలవాఁడును, అగు రాముని నామనసులోఁ జింతనచేయుచుందును.

శ్లో. సాకేతే మణికోటిభి స్సుఖచితే దివ్యాంబరాలంకృతే
హేమస్తంభసహస్రకోటిఘటితే తారాపథాత్యున్నతే,
రమ్యే స్వర్ణమయే విచిత్రభవనే దివ్యాంత మత్తైర్ముదా
రామం స్మేరముఖాంబుజం రఘుపతిం సీతాసమేతం భజే. ౪

మ. ప్రకటాయోధ్యను నూత్నరత్నమయమై ♦ రమ్యంబునై తారకా
నికరాత్యున్నత మై సువర్ణమణిసం♦దీప్తాయుతస్తంభస
త్పరకం బై విమలాంబరోజ్జ్వలితమా♦చోద్యాలయావాసుఁ డై
సకళత్రుండు దరస్మితాస్యుఁ డగునా♦త్మాదీశు సేవించెదన్.

తా. అయోధ్యలో, కోట్లకొలఁది రత్నములచే లెక్కగాఁ జెక్కఁబడినదియు, దివ్యములయిన వస్త్రములచే నలంకరింపఁబడినదియు, అనంతములయిన బంగారుస్తంభములచేఁ గూర్పఁబడినదియు, ఆకాశమంత పొడవుగలదియు, సొగసయినదియు, బంగారుమయమైనదియు నగు విచిత్రమందిరమున, సీతాసమేతుఁడై సంతోషముచేతను

పాదికలతో నాడుచుండువాఁడును, చిఱునగవుతోడి ముఖపద్మముగలవాఁడును అగు శ్రీరాముని సేవించెదను.

శ్లో. సాకేతే మణితోరణాంచితలసద్వీథీకతే ప్రాంగణే
సానందం భరతాదిభి స్సహచరై రత్యంతమోదాకరైః,
క్రీడంతం మణికందుకైః కరగతై రన్యోన్య మత్యుజ్జ్వలైః
పౌరస్త్రీనయనోత్సవైః ప్రతిదినం పూజ్యం భజే రాఘవమ్. ౫

మ. తతసాకేతపురంబునందు మణిసంతానస్ఫురత్తోరణాం
చితవీథీకతచత్వరంబున మణిశ్రేష్ఠోజ్జ్వలత్కందుక
స్థితహస్తుండయి సోదరాదియుతుఁడై స్త్రీలోలనేత్రోత్సవా
ర్చితుఁడై నిత్యముఁ గ్రీడల న్మలఁగునాశ్రీరాము సేవించెదన్.

తా. రత్నాలతోరణాలతో నొప్పుచుఁ బ్రకాశించు పలువీథులుగల అయోధ్యలో, ప్రాంగణమునందు, మిగుల సంతసమును గలిగించు భరతాదులగు సహచరులతో సానందముగా, హస్తగతములును, మిగులఁ బ్రకాశించునవియు, పురస్త్రీల కన్నుల కానందమును గలిగించునవియు నగురత్నాలబంతులతోఁ దమలోఁదాము ప్రతిదినము నాడుచుండెడివాఁడును పూజ్యుఁడును అగు రాముని సేవించుచుందును.

శ్లో. సాకేతే కనకాద్రిశృంగసదృశే కల్పద్రుమై రావృతే
వైడూర్యాదిమణీంద్రకాంతిఘటితే దేవేంద్రనీలోజ్జ్వలే,
కుర్వంతం మణిభూషణా మణిగృహే మాణిక్యపీఠే భజే
పుత్రా మన్మథసుందరా కుశలవా సంసేవ్యపాదా జనైః. ౬

మ. ప్రకటాయోధ్యను మేరుశృంగనిభ మై భవ్యామరానోకహ
ప్రకరప్రావృత మై మణిస్థగిత మై రంజిల్లుసద్మంబునం
దకలంకం బగురత్నపీఠి సుమణిస్తోత్రాయు లై నట్టిపు
త్రకయుగ్మార్చితపాదపద్ముఁ డగుశ్రీరామాధిపుం గొల్చెదన్.

తా. అయోధ్యయందు మేరుపర్వత శిఖరముతో సమానమైనదియు, కల్పవృక్షములచే నావరింపఁబడినదియు, వైడూర్యము మొదలైన మణిశ్రేష్ఠముల కాంతులచేఁ గూర్పఁబడినదియు, ఇంద్రనీలములచేఁ బ్రకాశించునదియు నగు రత్నగృహమందలి రత్నాసనమందున్నవాఁడును, మన్మథునివలెఁ జక్కనివారును, జనులచే సేవింపఁదగు పాదములుగలవారును, పుత్రులును, అగు కుశలవులను మణులతోడి భూషణములుగలవారినిగాఁ జేయుచుండువాఁడును అగు రాముని సేవించెదను.

శ్లో. సాకేతే జననీకరార్పితలసత్కస్తూరికాసుందరే
ఫాలే మౌక్తికజాలకం శశినిభం స్వర్ణాంకితం వర్తులమ్,
చూడాలంబిమనోజ్ఞహారకలితం బిభ్రాణ మత్యుజ్జ్వలం
రామం కోసలపుత్రికావరసుతం సీతాసమేతం భజే. ౨

మ. నుదుటన్ గస్తురిబొట్టు తల్లి యునుపన్ ♦ ముత్యాలలాముంబు ప
ర్వదినేందూజ్జ్వల మై సువర్ణమయ మై ♦ రంజిల్ల సాకేతప
త్సదనుం డై రమణీయహారధరుఁ డై ♦ స్వస్థాత్ముఁ డై భక్తలో
లదయాళుం డగుకౌసలేయుఁ గొలుతున్ ♦ లక్ష్మీశు రామప్రభున్.

తా. అయోధ్యయందు, తల్లి చేతిచే నుంచఁబడి ప్రకాశించు కస్తూరితిలకముచేఁ జక్కనైన నుదుటను చంద్రునితో సమానమైనదియు, బంగారుచేఁ జిహ్నితమైనదియు, గుండ్రనైనదియు, జుట్టునందు వ్రేలుచుఁ జక్కనైనదియు నగు హారముతోఁ గూడినదియు, మిక్కిలి ప్రకాశించునదియు నగుముత్యాలజాలకమును ధరించుచున్నవాఁడును, కౌసల్యకుమారుఁడును, సీతాసహితుఁడును అగు రాముని సేవించెదను.

శ్లో. సాకేతే సరయూజలేఽతివిమలే ప్రోత్ఫుల్లపద్మాంచితే
దివ్యస్త్రీకరకోటినృత్యరుచిరే స్వర్గాపగాసుందరే,
పశ్యంతీషు సురాంగనాసు శపథం క్రీడంత ముర్వీసుతా
బాహుభ్యాం విమలోదకేన రుచిరం సీతాసమేతం భజే. ౩

మ. అమలం బై వికచాబ్జ మై దివిజక♦న్యాజాలలీలార్హ మై
యమరద్వీపవతీసమానసరయూ♦క్రీడన్ సురస్త్రీసమూ
హములన్ గాంచ సభార్యుఁ డై కరములం♦దంభోవిహారంబు చి
త్రము రంజిల్లఁగఁ జేయురాఘవు నయో♦ధ్యానాథు సేవించెదన్.

తా. అయోధ్యలో, మిక్కిలి స్వచ్ఛమైనదియు, వికసించినపద్మములతో ఒప్పునదియు, చక్కని మిక్కిలియగు దేవతాస్త్రీల నాట్యముచే శోభయుతమైనదియు, మందాకినివలె సుందరమైనదియు నగుసరయూనదీజలములో, దేవతాస్త్రీలు చూచుచుండఁగా, పంతముతోఁ గూడుకొన్నట్టుగా, సీతచేతులచేతను జల్లఁబడుచుండెడి నిర్మలోదకముచేఁ గ్రీడించువాఁడును, అనఁగా సీతతో జలక్రీడలాడువాఁడును, చక్కనివాఁడును, సీతాసహితుఁడును అగు రాముని సేవింతును.

శ్లో. కదా సురతరుస్థలే కనకమంటపే పుష్పకే
వరాసన ముపేయుషీ వసుదళారవిందోజ్జ్వలే,

కరేణ హృదయస్పృశా కలితముద్రచిన్ముద్రికా
మమ స్ఫురతు వాసనా మనసి బద్ధవీరాసనా. ౯

మ. ఒకకాలంబునఁ గల్పశాఖికడఁ జెన్నొప్పారుసౌవర్ణర
త్నకసన్మందిరమధ్యహేమదళపద్మభ్రాజితం బైన పు
ష్పకమధ్యంబున రత్నపీఠి నిజవామన్యస్తహస్తుండు తా
రకచిన్ముద్రకరాంబుజుండు విబుధారాధ్యుండు వీరాసనుం
డకలంకుం డగురామచంద్రుఁడు మదీయాత్మస్థలిన్ భాసిలున్.

తా. కల్పవృక్షముక్రిందను, బంగారుమండపముపైని, ఎనిమిదిరేకులుగల పద్మముచేఁ బ్రకాశించు పుష్పకమందలి శ్రేష్ఠమయిన సింహాసనమును బొందినదియు, హృదయస్థానమును స్పృశించు హస్తముచేతను జూర్పఁబడిన జ్ఞానముద్రగలదియు, కూర్పఁబడిన వీరాసనముగలదియు నగు శ్రీరామరూపమయిన వాసన నామనమునం దెప్పుడు స్ఫురించునో కదా!

శ్లో. నదీరమణబంధనం మతిమతా ముదారం ధనం
జగత్సతతనందనం సకలకామనిష్యందనమ్,
విలిప్తహరిచందనం వినుతయాతుసంక్రందనం
భజామి రఘునందనం పవననందనస్యందనమ్. ౧౦

ఉ. చందనచర్చితుండు రఘుసత్తముఁ డంబుధిబంధనుండు సం
క్రందనవందితుండు శ్రితలోకముదారధనుండు సంతతా
నందుఁడు గంధవాహప్రియనందనవాహనుఁ డిష్టదాయి పౌ
రందరనీలవర్ణుఁ డగురాముపదాబ్జము లాశ్రయించెదన్.

తా. సముద్రుని బంధించినవాఁడును, వందితులకు గొప్పధనమయినవాఁడును, లోకముల నెల్లప్పుడును ఆనందింపఁజేయువాఁడును, ఎల్లవారికోరికలను బ్రవహింపఁజేయువాఁడును, పూయఁబడినహరిచందనముగలవాఁడును, స్తోత్రముచేయు విభీషణ దేవేంద్రులు గలవాఁడును, ఆంజనేయుఁడు రథముగాఁగలవాఁడును అగు రఘునందనుని రాముని సేవించెదను.

శ్లో. రక్తాంభోరుహలోచనం కువలయశ్యామం కపోలే ధనుః
కోటిన్యస్తకరాంబుజం ధృతతనుత్రాణం జటామండితమ్,
వీరాకారం ఖరదూషణత్రిశిరసా మాబద్ధగోధాంగుళి
త్రాణం మార్గణపూర్ణతూణయుగళం కోదండరామం భజే. ౧౧

మ. శరసంపూర్ణనిషంగి యై కవచి యై ♦ శ్యామాంగుఁ డై విశ్వస
ద్గురుఁ డై శోణసరోజనేత్రయుగుఁ డై ♦ గోధాంగుళిత్రాణుఁ డై
ఖరముఖ్యాసురయూథసంహరణుఁ డై ♦ కాండాసనాగ్రస్ఫుర
ద్గురుహస్తుం డగునాజటిన్ గొలిచెదన్ ♦ కోదండరామప్రభున్.

తా. ఎఱ్ఱఁదామరలవంటికన్నులుగలవాఁడును, కలువవలె నల్లనివాఁడును, చెక్కిలియుండలి ధనుష్కోటియం దుంచఁబడిన హస్తపద్మముగలవాఁడును, ధరింపఁబడిన కవచము గలవాఁడును, జటలచే నలంకరింపఁబడిన వాఁడును, ఖర-దూషణ-త్రిశిరస్కులను జయించినవాఁడును, కట్టఁబడినగోధాంగుళిత్రాణముగలవాఁడును, బాణములతో నిండిన - అమ్ములపొదులుగలవాఁడును, అగుకోదండరాముని సేవించెదను.

శ్లో. శ్రీమత్కల్పద్రుమూలే సకలమణిమయే మండపే పుష్పకాఖ్యే
తన్మధ్యే సూర్యబింబద్యుతి సరసిరుహే శోభమానాష్టపత్రే,
పశ్యన్ స్నిగ్ధాంగదీప్త్యా జనకతనయయా వామభాగోపసేవ్య
స్సౌమిత్రిం భానుపుత్రం పవనసుతయుతం పాతుమాం రామచన్ద్రః.

చ. సురతరుమూలరత్నమణి♦శోభితమండపమధ్య పుష్పకాం
తరరవిదీపితాష్టదళ♦తామరసాంతరవాసి యై ధరా
వరసుత వామభాగమున ♦ భాసిల లక్ష్మణవాయుజాదిస
త్పురుష సమర్చితుం డయిన ♦ భూపతిరాముఁడు నన్నుఁ బ్రోవుతన్.

తా. శ్రీమంతమయిన కల్పవృక్షముక్రిందను, సర్వ రత్నమయమై పుష్పకమను పేరు గల మంటపమున, దాని నడుమను, సూర్యబింబమువంటి కాంతి గలదియు, శోభించుచున్న యెనిమిదిదళములుగలదియునగు పద్మమునందుఁ గూర్చున్నవాఁడై, దట్టమయిన శరీరకాంతిగల సీతచేతను ఎడమప్రక్కన సేవింపఁబడినవాఁడై, హనుమంతుని లక్ష్మణుని, సుగ్రీవుని చూచుచున్న రామచంద్రుఁడు నన్ను రక్షించుఁగాక.

శ్లో. వినీలజలదోపమం విపులచంద్రబింబాననం
వినిద్రమణికుండలం వికచపుండరీకేక్షణమ్,
విభిన్నదనుజాధిపం విధృతబాణబాణాసనం
విభీషణవరప్రదం విజయరామ మీడే౽నిశమ్. ౧౩

మ. హరినీలాంబుదగాత్రుఁ దామరసప♦త్రాక్షున్ శరచ్చంద్రభా
సురవక్త్రున్ మణికుండలాంచితు ధను♦స్తూణీరబాణోజ్జ్వలున్

సురవిద్వేషణపోషణాంతకు మునిస్తుత్యుఁ దశగ్రీవసో
దరసమ్మోదవిధాయకున్ వరదు సీతారాముఁ జింతించెదన్.

తా. నీలమేఘముతో సమానుఁడును, నిర్మలమయిన చంద్రబింబమువంటి మొగముగలవాఁడును, ప్రకాశించు రత్నకుండలములుగలవాఁడును, వికసించిన పుండరీకములవంటి కన్నులుగలవాఁడును, రావణుని జయించినవాఁడును, బాణమును, ధనుస్సును ధరించినవాఁడును, విభీషణునికి వరముల నిచ్చినవాఁడును, అగు విజయరాముని నుతించెదను.

శ్లో. రాజద్రాజీవనేత్రం రఘుకులతిలకం రంజితాశేషలోకం
వామాంకారూఢసీతం వరశరధనుషం కుండలోద్దీప్తగండమ్,
శ్యామం శాంతం ప్రసన్నం దరహసితముఖం వజ్రసింహాసనస్థం
రామం రాజత్కిరీటం రవిశతవిశదం రాజరాజేశమీడే. ౧౮

చ. సరసిజనేత్రుఁ జాపధరు శాంతుఁ బ్రసన్ను దరస్మితాస్య భా
స్కరకులు లోకరంజకుఁ బ్రకాశకిరీటు సువర్ణకుండలున్
ధరణిసుతావలోకనుఁ బతంగశతోజ్జ్వలు వజ్రపీఠుఁ గం
ధరనిభనీలు రాజవరు దాశరథిన్ శరణంబు వేఁడెదన్.

తా. ప్రకాశించు పద్మములవంటికన్నులుగలవాఁడును, రఘువంశమునకుఁ దిలకప్రాయుఁడును, ఎల్లలోకములను రంజింపఁజేయువాఁడును, ఎడమతొడపైని గూర్చున్న సీతగలవాఁడును, శ్రేష్ఠమయిన బాణములు, ధనుస్సుగలవాఁడును, కుండలములచేత ప్రకాశించు చెక్కులు గలవాఁడును, చామనచాయవాఁడును, శాంతుఁడును, ప్రసన్నుఁడును, చిఱునగవుతోడి మొగముగలవాఁడును, వజ్రాల సింహాసనముపైని గూర్చున్నవాఁడును, ప్రకాశించు కిరీటముగలవాఁడును, నూఱుసూర్యులవలెఁ ప్రకాశించువాఁడును, రాజాధిరాజులకుఁ ప్రభువును అగు రాముని స్తుతించెదను.

శ్లో. భద్రవ్యాఖ్యానముద్రాం కరసరసిరుహే దక్షిణే ధారయంతం
సవ్యే జానున్యుదారం కరమపి చ ముదాధారయంతం స్ఫురంతమ్,
పశ్యంతం వామభాగే కరధృతకమలాం చిత్రభూషావిశేషాం
వైదేహీం కాంచనాభ్యాం స్తనభరనమితాం భావయే రామచంద్రమ్.

మ. ఒకహస్తాబ్జము జానువం దునిచి వేఱొక్కంట వ్యాఖ్యానము
ద్ర కరం బూని సువర్ణవర్ణధృతపద్మన్ చిత్రభూషాన్వితన్
బ్రకటోరస్స్థలజాతనమ్ర యగుభార్యన్ దావలం గాంచు తా
రకనామున్ రవికోటిధాముఁ దగు శ్రీరామున్ బ్రశంసించెదన్.

తా. కుడిదియగు హస్తపద్మమందు మంగళకరమయిన వ్యాఖ్యానముద్రను ధరించుచున్నవాఁడును, ఎడమ మోఁకాలిపయిని గొప్పదియగు హస్తమును ధరించుచున్నవాఁడును, సంతోషముచేతను ప్రకాశించుచున్నవాఁడును, ఎడమభాగమునందున్నదియు, చేతఁ బట్టఁబడిన పద్మముగలదియు, చిత్రములయిన భూషావిశేషములుగలదియు, బంగారువలె నొప్పుచుండునదియు, స్తనభారముచేతను వంగినదియు నగు సీతను చూచుచుండువాఁడును, అగు శ్రీరామచంద్రుని భావించెదను.

శ్లో. విబుధవిటపిమూలే జానకీలక్ష్మణాభ్యాం
సహిత మనిలవేగం బాణ మాదాయ చాపమ్,
బహుశరపటుతూణం రత్నభూషోపహారం
విబుధభరణచిత్తం చింతయే రామచంద్రమ్. ౧౧

మ. అమరాగస్థలి ధారుణీతనయతో ♦ హర్షంబునన్ గూడి స
త్త్వమదామాంచితుఁ డై యనేకశరసం♦శోభానిషంగాన్వితుఁ డై
యమరత్రాణధురీణుఁ డై పవనవే♦గాఢ్యాగ్రాన్వితుఁ డై
కమనీయాకృతి నైనరామధరణీ♦కాంతున్ మదిన్ గొల్చెదన్.

తా. కల్పవృక్షముక్రిందను సీతాలక్ష్మణులతోఁ గూడి యుండువాఁడును, వాయువేగముగల బాణమును, ధనుస్సును, అనేకములయిన బాణములచేతను సమర్థమయిన అమ్ములపొదిని స్వీకరించియుండువాఁడును, చక్కనిభూషణములు కానుకలుగలవాఁడును, విబుధులను భరించుటయందు మనస్సుగలవాఁడును అగు శ్రీరామచంద్రుని చింతనచేయుదును.

శ్లో. జానాతి రామ తవ తత్త్వగతిం హనూమాన్
జానాతి రామ తవ సఖ్యగతిం కపీశః,
జానాతి రామ తవ యుద్ధగతిం దశాస్యో
జానాతి రామ ధనదానుజ ఏవ సత్యమ్. ౧౨

ఉ. తావకమిత్రభావమును ♦ తామరసాప్తసుతుం డెఱుంగు నీ
పావనతత్త్వలక్షణము ♦ పావకమిత్రసుతుం డెఱుంగు ధా
త్రీవర నీదుసంగరగ♦తిన్ దశకంఠుఁ డెఱుంగు భక్తలో
కావన నీదుసత్యము ద♦శాస్యునితమ్ముఁ డెఱుంగు రాఘవా.

తా. రామా! నీయథార్థమయినగతిని హనుమంతుఁ డెఱుఁగును. రామా! నీ యొక్క స్నేహముసంగతిని సుగ్రీవుఁ డెఱుఁగును. రామా! నీయుద్ధముసంగతి రావణుఁ డెఱుఁగును. రామా! నీసత్యమును కుబేరునితమ్ముఁడు విభీషణుఁడే యెఱుఁగును.

శ్లో. హే రామ హే రమణ హే జగదేకవీర
హే నాథ హే రఘుపతే కరుణాలవాల,
హే జానకీరమణ హే జగదేకబంధో
మాం పాహి దీన మనిశం కృపణం కృతఘ్నమ్. ౧౮

శా. ఓరామా జగదేకవీర రమణా ♦ ఓజానకీనాయకా
ఓరాజేంద్ర కృపాలవాల వరదా ♦ ఓవిశ్వవిశ్వావనా
ఓరాజీవదళాక్ష ఓరఘుపతీ ♦ ఓనాథ మన్నింపు నా
నేరం బేను కృతఘ్నుఁడన్ గృపణుఁడన్ ♦ నిన్నే మది న్నమ్మితిన్.

తా. ఓరామా! ఓరమణా! ఓ జగదేకవీరా! ఓనాథా! ఓరఘుపతీ! ఓ దయాధారమా! ఓ సీతారమణా! ఓ జగదేకబాంధవా! దీనుఁడను, కృపణుఁడను, కృతఘ్నుఁడను, అగు నన్ను ఎల్లప్పుడును రక్షించుము.

శ్లో. అయోధ్యానాథ రాజేంద్ర సీతాకాంత జగత్పతే!
శ్రీరామ పుండరీకాక్ష రామచంద్ర నమోఽస్తు తే. ౧౯

మ. స్థిరసాకేతపురాధినాథునకు ధా♦త్రీపుత్రీనాథర్తకున్
ధరణీశేంద్రునకున్ జగత్పతికి దై♦త్యధ్వంసికిన్ నవ్యవి
స్ఫురితాంభోరుహపత్రనేత్రునకుఁ దే♦జోరాశికిన్ బావని
స్తుతికిన్ శ్రీరఘురామచంద్రునకు న♦శ్రాంతంబు నే మ్రొక్కెదన్.

తా. అయోధ్యానాథా! రాజేంద్రా! సీతాకాంతా! జగత్పతీ! శ్రీరామా! పుండరీకాక్షా! రామచంద్రా! నీకు నమస్కార మగుఁగాక.

శ్లో. దక్షిణే లక్ష్మణో యస్య వామతో జానకీ శుభా,
పురతో మారుతిర్యస్య తం నమామి రఘూత్తమమ్. ౨౦

ఉ. దాపట జానకీసతి ము♦దంబున నుండఁగ దక్షిణంబునన్
జాపముఁ దాల్చి లక్ష్మణుఁడు ♦ సన్నుతిఁ జేయఁ బురోపకంఠమం-
దావవనాత్మజుండు వివ♦యంబునఁ గొల్వఁ దెలంగునట్టిధా
త్రీపరిపాలశీలునకు ♦ శ్రీరఘురామున కేను మ్రొక్కెదన్.

తా. ఎవనియొక్క కుడివైపున ధనుర్ధరుఁ డయినలక్ష్మణుఁడును, ఎడమవయిపున శుభస్వరూపురా లగు సీతయు, ఎదుటను ఆంజనేయుఁడును ఉందురో వానిని రఘువంశశ్రేష్ఠుఁ డగురాముని నమస్కరించుచుందును.

తా. కుడిదియగు హస్తపద్మమందు మంగళకరమయిన వ్యాఖ్యానముద్రను ధరించుచున్నవాఁడును, ఎడమ మోఁకాలిపయిని గొప్పదియగు హస్తమును ధరించుచున్నవాఁడును, సంతోషముచేతను ప్రకాశించుచున్నవాఁడును, ఎడమభాగమునందున్నదియు, చేతఁ బట్టఁబడిన పద్మముగలదియు, చిత్రములయిన భూషావిశేషములు గలదియు, బంగారువలె నొప్పుచుండునదియు, స్తనభారముచేతను వంగినదియు నగు సీతను చూచుచుండువాఁడును, అగు శ్రీరామచంద్రుని భావించెదను.

శ్లో. విబుధవిటపిమూలే జానకీలక్ష్మణాభ్యాం
సహిత మనిలవేగం బాణ మాదాయ చాపమ్,
బహుళశరపటుతూణం రమ్యభృత్పుష్పహారం
విబుధభరణచిత్తం చింతయే రామచంద్రమ్. ౧౭

మ. అమరాగస్థలి ధారుణీతనయతో ♦ హర్షంబునన్ గూడి స
త్సమదామాంచితుఁడై యనేకశరసం♦శోభానిషంగాస్త్రుఁడై
యమరత్రాణధురీణుఁడై పవనవే♦గాజిహ్మాగ్రాస్త్రుఁడై
కమనీయాకృతి నైనరామధరణీ♦కాంతున్ మదిన్ గొల్చెదన్.

తా. కల్పవృక్షము క్రిందను సీతాలక్ష్మణులతోఁ గూడి యుండువాఁడును, వాయువేగముగల బాణమును, ధనుస్సును, అనేకములయిన బాణములచేతను సమర్థమయిన అమ్ములపొదిని స్వీకరించియుండువాఁడును, చక్కనిపుష్పములహారములుగలవాఁడును, విబుధులను భరించుటయందు మనస్సుగలవాఁడును అగు శ్రీరామచంద్రుని చింతనచేయుదును.

శ్లో. జానాతి రామ తవ తత్త్వగతిం హనూమాన్
జానాతి రామ తవ సఖ్యగతిం కపీశః,
జానాతి రామ తవ యుద్ధగతిం దశాస్యో
జానాతి రామ ధనదానుజ ఏవ సత్యమ్. ౧౮

ఉ. తావకమిత్రభావమును ♦ తామరసాప్తసుతుం డెఱుంగు నీ
పావనతత్త్వలక్షణము ♦ పావకమిత్రసుతుం డెఱుంగు ధా
త్రీవర నీదుసంగరగ♦తిన్ దశకంఠుఁ డెఱుంగు భక్తలో
కావన నీదుసత్యము ద♦శాస్యునితమ్ముఁ డెఱుంగు రాఘవా.

తా. రామా! నీయథార్థమయినగతిని హనుమంతుఁ డెఱుఁగును. రామా! నీ యొక్క స్నేహముసంగతిని సుగ్రీవుఁ డెఱుఁగును. రామా! నీయుద్ధముసంగతి రావణుఁ డెఱుఁగును. రామా! నీసత్యమును కుబేరునితమ్ముఁడు విభీషణుఁడే యెఱుఁగును.

విద్యుత్కోటిసహస్రదీధితిలసత్కోటీర మత్యుజ్జ్వలం
ధ్యాయే తారకనామ మీశ్వరసఖం దైతేయవంశాపహమ్. ౨౩

మ. మునికాంతాగతశాపమోచనపదాంభోజాతుఁ బ్రావృడ్ఘనా
ఘనగాత్రున్ వికచాబ్జనేత్రు గిరిజాకాంతాప్త దైత్యారిఁ బా
వనవిద్యుచ్ఛతకోటిదీప్తమకుటభ్రాజత్తమాంగున్ జనా
ర్దనునిన్ దారకనాము రాము నియతిన్ ధ్యానింతు నశ్రాంతమున్

తా. నీలమేఘమువలెనె నల్లనివాఁడును, నిర్మలుఁడును, పద్మములవంటికన్నులుగలవాఁడును, అహల్యశాపమును నివారించుటయందుఁ బరిచయముగల పాదపద్మములుగలవాఁడును, భూమికిఁ బ్రభువును, కోట్లకొలఁదిమెఱుపులకాంతులతోఁ బ్రకాశించుకిరీటము గలవాఁడును, దివ్యాస్త్రములచేఁ బ్రకాశించువాఁడును, తరింపఁజేయుపేరుగలవాఁడును, శివునికి స్నేహితుఁడును, రాక్షసవంశమును గొట్టిన వాఁడు నగురాముని ధ్యానించెదను.

శ్లో. దశరథసుత మీశం దండకారణ్యవాసం
శతమఖమణినీలం జానకీప్రాణలోలమ్,
సకలభువనమోహం సన్నుతాంభోదదేహం
బహుళనుతసముద్రం భావయే రామభద్రమ్. ౨౪

చ. శతముఖరత్ననీలఘనసన్నిభగాత్రుని దండకాటవీ
స్థితు జనకాత్మజాధిపు సదివతిసన్నుతు విశ్వమోహనున్
క్షితిపతి నీశ్వరేశ్వరునిఁ జిన్మయు దాశరథిన్ దయానిధిన్
వితతచరిత్రు సత్యు రఘువీరుని సంతత మాశ్రయించెదన్.

తా. దశరథునికుమారుఁడును, ప్రభువును, దండకారణ్యమునందున్నవాఁడును, ఇంద్రనీలమణివలె నల్లనివాఁడును, సీతప్రాణములయం దాసగలవాఁడును, ఎల్లలోకములను మోహింపఁజేయువాఁడును, మంచిమేఘమువంటి శరీరముగలవాఁడును, పలువిధముల నుతించినసముద్రముగలవాఁడును, అగురామభద్రుని భావించుచుందును.

శ్లో. సరయూతీరవనే లతానిలయనే సద్రత్నవేదీతటే
సుమపర్యంకతలే విదేహసుతయా సార్ధం పరిక్రీడతః,
కస్తూరీఘనసారచందనమిళద్గంధోల్లసత్పావనీ
పాయాన్మూర్తి రనామయా రఘుపతేర్భద్రాత్మికా నోఽనిశమ్. ౨౫

మ. సరయూతీరవనిన్ లతాగృహమునన్ సద్రత్నవేదిస్థలిన్
విరిశయ్యన్ జనకాత్మజాసహితుఁడై వేడ్కన్ లసచ్చంద్రక

తా. పడిదియగు హస్తపద్మమందు మంగళకరమయిన వ్యాఖ్యానముద్రను ధరించుచున్నవాఁడును, ఎడమ కాంతాళియయిన గొప్పదియగు పుస్తకమును ధరించుచున్నవాఁడును, సంతోషముచేతను ప్రకాశించుచున్నవాఁడును, ఎడమభాగమునందున్నదియు, చేతఁ బట్టుకోఁబడిన పద్మముగలదియు, చిత్రములయిన భూషణవిశేషములు గలదియు, బంగారువంటి కొప్పుచుండునదియు, స్తనభారముచేతను వంగినదియు నగు సీతను చూచుచుండువాఁడును, అగు శ్రీరామచంద్రుని భావించెదను.

శ్లో. విబుధవిటపిమూలే జానకీలక్ష్మణాభ్యాం
సహిత మనిలవేగం బాణ మాదాయ చాపమ్,
బహుళరిపుతూణం రత్నగ్రైవేయహారం
విబుధభరణచిత్తం చింతయే రామచంద్రమ్. ౧౭

మ. అమరాగస్థలి ధారుణీతనయతో • హర్షంబునన్ గూడి స
త్సుమదామాంచితుఁడై యనేకశరసం•శోభానిషంగాస్త్రుఁడై
యమరత్రాణధురీణుఁడై పవనవే•గాఢ్యాగ్ర్యాస్త్రుఁడై
కమనీయాకృతి యైనరామధరణీ•కాంతున్ మదిన్ గొల్చెదన్.

తా. కల్పవృక్షముక్రిందను సీతాలక్ష్మణులతోఁ గూడి యుండువాఁడును, వాయువేగముగల బాణమును, ధనుస్సును, అనేకములయిన బాణములచేతను సమర్థమయిన అమ్ములపొదిని స్వీకరించియుండువాఁడును, చక్కని గ్రైవేయహారములుగలవాఁడును, విబుధులను భరించుటయందు మనస్సుగలవాఁడును అగు శ్రీరామచంద్రుని చింతనచేయుదును.

శ్లో. జానాతి రామ తవ తత్త్వగతిం హనూమాన్
జానాతి రామ తవ సఖ్యగతిం కపీశః,
జానాతి రామ తవ యుద్ధగతిం దశాస్యో
జానాతి రామ ధనదానుజ ఏవ సత్యమ్. ౧౮

ఉ. తావకమిత్రభావమును • తామరసాప్తసుతుం డెఱుంగు నీ
పావనతత్త్వలక్షణము • పావకమిత్రసుతుం డెఱుంగు భా
త్రివర నీదుసంగరగ•తిన్ దశకంఠుఁ డెఱుంగు భక్తిలో
పావన నీదుసత్యము ద•శాస్యునితమ్ముఁ డెఱుంగు రాఘవా.

తా. రామా! నీయథార్థమయినగతిని హనుమంతుఁ డెఱుఁగును. రామా! నీ యొక్క స్నేహముసంగతిని సుగ్రీవుఁ డెఱుఁగును. రామా! నీయుద్ధముసంగతి రావణుఁ డెఱుఁగును. రామా! నీసత్యమును కుబేరునితమ్ముఁడు విభీషణుఁడే యెఱుఁగును.

రణికుమారికాత్మకుము♦దప్రమదప్రదపూర్ణచంద్రుఁ డా
రవిసరావనాంబురుహా♦సోముఁడు లక్ష్మణభవ్యమానసా
రపరిపూర్ణచంద్రుఁడు జ♦గత్పరిపూరితకీర్తిసాంద్రుఁ డం
రమణివంశచంద్రుఁ డన♦మానుఁడు రాముఁడునన్నుఁబ్రోవుతన్.

తా. లక్ష్మణుని మానసమనెడి సముద్రమునకుఁ బున్నమచంద్రుఁడవును, సీత ప్రకాశించుకన్నులకుఁ బున్నమచంద్రుఁడవును, రాక్షసులముఖములనెడిపద్మ పూర్ణచంద్రుఁడవును, అగురాఘవా! రామచంద్రా! నన్ను సంరక్షించుము.

యస్య కించిదపి నో హరణీయం కర్మ కించిదపి నాచరణీయమ్,
ామనామ చ సదా స్మరణీయం లీలయా భవజలం తరణీయమ్. ౭౯

ంరుణి నేమహాత్మునక♦కారనుకర్మలు పోవిడంగ రా
రికి నస్యకర్మముల ♦ నించుక సేయుట పాడి గాదు దు
ర్వారదురంతపాపజల♦రాశిఁ దరింపఁగ హేతువైనయా
రఘురామనామము స్మ♦రింపఁదగుం బరమాత్మసిద్ధికిన్.

తా. ఎవనికిఁ గొంచెమయినను హరింపఁదగినది లేదో, ఎవనికిఁ గొంచెమైనను సేయఁదగినది లేదో వానిచేతను సదా రాముని నామము స్మరింపఁదగినది. విలాస సంసారసముద్రము దాఁటఁదగినది. అనఁగా, రామనామస్మరణము చేయువారి కిమన్నను మోక్షము గలుగుననుట.

ంగమాణ మభితో గృహాంగణే భృంగనీలమలకావృతాననమ్,
ంగళప్రదమమంగళాపహం సంగృణే దశరథాత్మజం హృది. ౮౦

ంళిసముదాయనీలచికు♦రావృతవక్త్రసరోజుఁడై సము
ల్లలభవనాంగణప్రకట♦సంతతసంచరణాఢ్యుఁడై యమం
గళపరిహారుఁడై లలిత♦కాంచనభూషణభూషితాంగుఁడై
పలరినరాఘవుం దశర♦థాత్మజుఁ జిత్తమునందు నిల్పెదన్.

తా. గృహాంగణమందంతటను ప్రాఁకుచుండువాఁడును, తుమ్మెదవలె నల్లని, ముంగురులచే నావరింపఁబడిన మొగముగలవాఁడును, మంగళములను గలిగించువాఁడును, అమంగళములను తొలఁగించువాఁడును అగుదశరథుని కుమారుని రా మనస్సునందు స్మరించెదను.

కనుజతిమిరభానుం తాపసైశ్చింత్యమానం
మితకలుషవారం సేవకే దుష్టదూరమ్,

దళితవిమతసాలం దండితారాతిజాలం
ప్రణతశిఖరిశత్రుం భవ్యపాథోధగాత్రమ్. ౩౧

మ. దనుజధ్వాంతసరోజమిత్త్రు సురనాథస్తోత్రు యోగీంద్రస
న్మునిసంభావితు సతతాశ్రితజనస్తోమాప్తు) విద్వేషిత
ర్జను నీలాంబుదగాత్రుఁ గల్మషగిరీంద్రచ్ఛేదదంభోళి దు
ర్జనసంహారుఁ గృపాసముద్రుఁ డగు శ్రీరామప్రభుం గొల్చెదన్.

తా. రాక్షసులనెడి చీఁకటికి సూర్యుఁడును, తాపసులచేతను చింతింపఁబడుచుండువాఁడును, భక్తులయందలిపాపముల సమూహమును శాంతినిపొందించువాఁడును, దుష్టులకు మారకుం డుండువాఁడును, ఏడుచెట్లను విఱుగఁగొట్టినవాఁడును, శత్రుసమూహమును శిక్షించినవాఁడును, నమ్రుఁడయిన యింద్రుఁడుగలవాఁడును, చక్కని మేఘమువంటి శరీరముగలవాఁడును అగురాముని స్మరించెదను.

శ్లో. హే గోపాలక హే దయాజలనిధే హే సద్గుణాంభోనిధే
హే దైత్యాంతక హే విభీషణదయాపారీణ హే భూపతే,
హే వైదేహసుతామనోజ్ఞవిహృతే హే కోటిమారాకృతే
హే నవ్యాంబుజనేత్ర పాలయ పరం జానామి న త్వాం వినా. ౩౨

శా. ఓదైత్యాంతక యోదయాజలనిధీ యోధారుణీపాల యో
వైదేహీపతి యోవిభీషణకృపాపారీణ గోపాలకా
యోదాసస్తుత శంభుచాపదళనా యోమన్మథాకార యో
శ్రీదాతా నినుఁ దక్క నన్యులను నేఁ జింతింపఁ బ్రోవంగదే.

తా. ఓగోపాలకా! ఓదయాసముద్రుఁడా! ఓసద్గుణసముద్రుఁడా! ఓరాక్షసాంతకా! ఓవిభీషణునివిషయమునఁ బూర్ణమయిన దయగలవాఁడా! ఓభూనాథా! ఓసీతమనఃపద్మమునందు విహారముగలవాఁడా! ఓకోటిమన్మథులవంటి యాకారముగలవాఁడా! ఓవికసించినపద్మములవంటి నేత్రములుగలవాఁడా! నన్నుఁ బాలింపుము. నిన్ను విడిచి యితరుల నెఱుఁగను.

శ్లో. సాకేతే ప్రణవాఖ్యరత్నఖచితే సింహాసనే సంస్థితం
విశ్వామిత్రవసిష్ఠగాలవముఖై రాశీర్భి రంచజ్జటైః,
పూజ్యం పార్శ్వగతాబ్జచారునయనా విద్యుచ్చలచ్చామరం
వందే కోమలమస్మితాననమిలారత్నావతీర్ణం హరిమ్ ౩౩

మ. తనప్రోలన్ ప్రణవాఖ్యపీఠిఁ జెలువొందన్ నవ్యరత్నోరుహా
వన లిర్వంకలఁ జామరద్వయము మమందప్రాభి వీవన్ జటి

జను లాశీర్వచనంబు లియ్య ధరణీచక్రావనాసక్తుఁ డై
యనిశంబుఁ దరహాసవక్త్రుఁ డగు రామాధీశు సేవించెదన్.

తా. అయోధ్యయందు, ప్రణవమను పేరుగలదై రత్నఖచితమయిన సింహాసనమునఁ గూర్చున్నవాఁడును, విశ్వామిత్రుఁడు- వసిష్ఠుఁడు- గాలవుఁడు మొదలయిన జటాధరులచేతను ఆశీర్వాదములచేఁ బూజ్యుఁడును, ప్రక్కలను నిలువఁబడినవారును, పద్మములవలెఁ జక్కనయినకన్నులుగలవారును అగు స్త్రీలయొక్క మెఱపులవలెఁ జంచలములయిన చామరములు గలవాఁడును, కోమలమయిన మంచిచిఱునగవుతోడి మొగముగలవాఁడును, భూమిని రక్షించుట కవతరించినవాఁడును, విష్ణుస్వరూపుఁడును అగు రాముని ప్రొక్కెదను.

శ్లో. నిత్యం నిర్జితపంకసంభవమహానేత్రశ్రియం రాఘవం
రామం పార్వణచంద్రచారువదనం దిక్పాలకైస్సేవితమ్,
కర్పూరాగరుచందనార్ద్రహృదయం మందారమాలాంచితం
విద్యుత్పుంజనిభాంబరావృతతనుం రామం భజే శ్యామలమ్. ౩౮

చ. విమలనవాంబుజాతదళవిస్తృతనేత్రు దిగీశవందితుఁ
సుమహితపూర్ణచంద్రనిభసుందరవక్త్రు లసత్తటిల్లతా
సమవసనుఁ హృదార్ద్రసితవాసితచందనచంద్రకర్దముఁ
రమణ సుపర్వభూజసుమరాజితధాముని రాము సన్నుదన్.

తా. శాశ్వతుఁడును, పద్మములను జయించినపెద్దకన్నుల శోభగలవాఁడును, రఘువంశమునఁ బుట్టినవాఁడును, పున్నమనాఁటి చందురునివలెఁ జక్కనయినమొగముగలవాఁడును, దిక్పాలురచేతను సేవింపఁబడువాఁడును, కర్పూరము- అగరు చందనములచేఁ దడిసినహృదయము గలవాఁడును, కల్పవృక్షముల పుష్పమాలచే శోభించువాఁడును, మెఱపులగుంపుతో సమానమయినవస్త్రముచే నావరింపఁబడిన శరీరముగలవాఁడును, నల్లనివాఁడును, అగు రాముని సేవించెదను.

శ్లో. శ్రీరామః కుశికాత్మజస్య వచనేనాకృష్య బాణాసనం
మారీచం చ సుబాహుకం శరయుగేనావాహవే లీలయా,
త్రాయన్ సుందరకౌశపక్షరుచిరస్సౌమిత్రిణా సంయుతః
పాయాన్నః కమలాసన స్మరరుణః కాలాంబుదశ్యామలః. ౩౯

మ. కడఁకన్ గాధితనూజువాక్యమున నాకర్ణాంతకోదండుఁ డై
వడి మారీచసుబాహులం దెగడి భావంబందు రంజిల్లర

మ్యుఁడు కాలాంబుదగాత్రుఁ డంబుజనిభాస్యుం డుజ్జ్వలత్కార్ముకా
ఢ్యుఁడు సౌమిత్రియుతుండు రాఘవుఁడు కాకుత్స్థుండు నన్ బ్రోవుతన్ .

తా. విశ్వామిత్రుని మాటచేతను ధనుస్సు నెక్కుపెట్టి యుద్ధమునందు రంకెల బాణములచేతను మారీచుని, సుబాహుని, ఆక్రమించినవాఁడును, చక్కనివానపాల నెత్తి సొగసైనవాఁడును, లక్ష్మణునితోఁ గూడినవాఁడును, పద్మమువంటి ముఖముంగల వాఁడును, దయతోఁ గూడినవాఁడును, వర్షాకాలమేఘమువలె నల్లనివాఁడును అగు శ్రీరాముఁడు మమ్ములను రక్షించుఁగాక.

శ్లో. ఆనందరూపం వరదం ప్రసన్నం
సింహేక్షణం సేవకపారిజాతమ్,
నీలోత్పలాంగం భువనైకమిత్రం
రామం భజే రాఘవరామచంద్రమ్. ౩౧

మ. శ్రితమందారము నూత్నరత్నవిలసత్సింహాసనాసీను భా
సితనీలోత్పలమేఘవర్ణుఁ గరుణాసింధుం బ్రసన్నాననున్
వరదున్ భువనైకమిత్రు నిరతానందస్వరూపున్ సురా
ర్చితు శ్రీరామధరాధినాథు మది నే సేవింతు నిష్టాప్తికిన్.

తా. ఆనందమే స్వరూపముగాఁ గలవాఁడును, వరములనిచ్చువాఁడును, ప్రసన్నుఁడును, సింహముచూపులవంటి చూపులుగలవాఁడును, సేవచేయువారికిఁ గల్పవృక్షమును, నల్లఁగలువవంటి శరీరముగలవాఁడును, లోకములకు ముఖ్యమిత్రుఁడును, రమింపఁజేయువాఁడును, అగురాఘవరామచంద్రుని సేవించెదను.

శ్లో. యుద్ధే ఘన స్సన్ఘన దద్భుతబాణవర్షై
రామః ప్రహారసమయే రజనీచరాణామ్,
రక్షానుకూలసమయాయ విభీషణాయ
లంకాధిపత్య మదిశ ద్రఘురామచంద్రః. ౩౨

చ. అసురకదంబజన్యమున నద్భుతవిద్యఁ గలంబవృష్టిఁ జెం
పెసఁగఁగ నించి రాక్షసుల నెల్లను గూలిచి రక్షణాఖ్యుఁ డై
చను శరణాగతుం దగు విభీషణు లంకకు రాజుఁ జేసి పొ
ల్పెసఁగినరామచంద్రునకు హేళికలాగ్రణి సేసు ప్రొక్కెదన్.

తా. రాముఁడు యుద్ధమునం దున్నవాఁడై కొట్టునప్పుడు రాక్షసులకు, ఆశ్చర్యకరమయిన బాణవర్షములచేతను, హానిని కలిగించెను. రక్షుసంకయుండైన రామ

చంద్రుఁడు రక్షించుట కనుకూలమయిన సమయములుగల విభీషణునికొఱకు లంకాధిపత్యము నిచ్చెను.

శ్లో. వేదాంతగానం స్వకృతైకదానం
హతాభిమానం త్రిదశప్రధానమ్,
గజేంద్రయానం విగతావసానం
శ్రీరామచంద్రం సతతం నమామి. ౩౮

చ. ప్రకటగజాధిరోహణునకు భవ్యనుతున్ సకలాగమాంతభ
ర్తకుఁ బరిమాణహీనునకు దాసధురీణునకున్ సురాగ్రనే
తకు నభిమానహారికిఁ బతంగకులాంబుధికైరవాధినా
యకునకు రామభూభుజునకుం గాజతనూజున కేను మ్రొక్కెదన్.

తా. వేదాంతములచేతనైన గానముగలవాఁడును, తనచేఁ జేయఁబడిన ముఖ్య దానములు గలవాఁడును, హత-చేసిన, అను-అభిమానములేనివాఁడును, దేవతలలో ముఖ్యుఁడును, మదగజమువంటి నడకగలవాఁడును, మొదలేనివాఁడును, అగు శ్రీరామ చంద్రుని సదా మ్రొక్కుచుందును.

శ్లో. శ్రీరామచన్ద్రం ధృతచాపసాయకం
నీలోత్పలాభం నలినాయతేక్షణమ్,
సౌమిత్రిణా సేవితపాదపంకజం
సీతాసమేతం శరణం భజే౽నిశమ్. ౩౯

ఉ. శ్రీరఘురామచంద్రు సరసీరుహపత్రవిశాలనేత్రు సీ
తారమణీసమేతు జలదప్రవిభాసితనీలగాత్రు శృం
గారవిభూషు దివ్యశరకార్ముకదీప్తకరాబ్జు నూర్మిళా
చారుముఖీపతిప్రణతసత్పదపద్ము సమాశ్రయించెదన్.

తా. ధనుర్బాణములను ధరించినవాఁడును, నల్లఁగలువవంటి కాంతి గలవాఁడును, పద్మములవలె విశాలములయిన కన్నులుగలవాఁడును, లక్ష్మణునిచేతను సేవింపఁబడు పాదపద్మములు గలవాఁడును, సీతాసమేతుఁడును, అగు శ్రీరామచంద్రుని ఎల్లప్పుడును శరణముగా సేవించెదను.

శ్లో. శ్రీరామచంద్ర కరుణాకర దీనబంధో
సీతాసమేత భరతాగ్రజ రాఘవేశ,
పాపార్తిభంజన భయాతురదీనబంధో
పాపాంబుధౌ పతిత ముద్ధర మా మనాథమ్. ౪౦

చ. హరి రఘురామచంద్ర భర♦తాగ్రజ సత్కరుణాపయోనిధీ
ధరణితనూభవాసహిత ♦ ధార్మిక పాతకిదీనబాంధవా
దురితమహాంధకారహర ♦ తోయజబాంధవ రాఘవేశ్వరా
తరణికులావతంస దురి♦తాబ్ధినిమగ్నుని నన్నుఁ బ్రోవవే.

తా. దయకు స్థానమయినవాఁడవును, దీనులకు బంధువవును, సీతతోఁ గూడినవాఁడవును, భరతున కన్నవును, రఘువంశపురాజులకుఁ బ్రభువవును, పాపము వలనఁ గలుగు బాధలను గొట్టువాఁడవును, భయాతురులయిన దీనులకు బంధుఁవవును, అగు నో శ్రీరామచంద్రా! పాపసముద్రములోఁ బడియున్నవాఁడను, దిక్కులేని వాఁడను అగు నన్నును ఉద్ధరింపుము.

శ్లో. ఇదం శరీరం శ్లథసంధి జర్జరం
పతత్యవశ్యం పరిణామపేశలమ్,
కిమౌషధం పృచ్ఛసి మూఢ దుర్మతే
నిరామయం రామకథామృతం పిబ ౪

చ. కడు శ్లథసంధిజర్జరిత♦గాత్ర మనిత్యము నాయు వల్ప మె
ల్లెడఁ బడిపోవునో తెలియ ♦ దెందుకు దివ్యమహౌషధంబు కో
ర్వడిదెవు నిరామయం బయిన ♦ రామకథామృత మెల్లకాలము
చెడక విమూఢతం బడక ♦ శీఘ్రము గ్రోలుచు నుండు చిత్తమా!

తా. ఓమూఢుఁడా! ఓరిమద్బుద్ధీ! ఈ శరీరము విడిపోయినసంధులుగల గనుకనే శిథిలమయినది పరిణామమునందు మృతమయినది తప్పక పడిపోవును. కాన దీనికౌషధ మేమియని యడిగెదవు? నిరామయమగు రామకథయనెడి యమృతము త్రాగుము.

శ్లో. దశముఖగజసింహం దైత్యగర్వాతిరంహం
కదనభయదహస్తం తారకబ్రహ్మశస్తమ్,
మణిఖచితకిరీటం మంజులాలాపవాటం
దశరథకులచంద్రం రామచంద్రం భజేఽహమ్. ౪

చ. దశరథవంశసాగరసు♦ధాకరు దానవగర్వభంజనున్
దశముఖకుంభిసింహమును ♦ తారకబ్రహ్మ మరీంద్రభీతిదున్
శశిసరసీజమిత్రవిల♦సన్మణిహేమకిరీటు మంజుభా
షి శరధితల్పు దాశరథి ♦ శ్రీరఘురాము సమాశ్రయించెదన్

తా. రావణుఁ డనెడియేనుఁగునకు సింహమును, క్షత్రియులగర్వము నణఁచునట్టి మిక్కిలి తేజముగలవాఁడును, యుద్ధములయందు భయమును గలిగించుమూర్తము గలవాఁడును, నారదబ్రహ్మమునిచే పూజింపఁబడినవాఁడును, మణులచే ఖచితమయిన కిరీటముగలవాఁడును, మృదువయిన మాటలకుఁ దోఁటయు, దశరథుని కులమున కాహ్లాదము గలిగించినవాఁడును అగు శ్రీరామచంద్రుని నేను సేవించెదను.

శ్లో. లంకావిరామం రణరంగభీమం
రాజీవనేత్రం రఘువంశమిత్రమ్,
కారుణ్యమూర్తిం కరుణాప్రపూర్తిం
శ్రీరామచంద్రం శరణం ప్రపద్యే. ౪౩

మ. అరవిందాయతపత్రనేత్రు రఘువంశాంభోధిపూర్ణేందు సం
గరరంగోజ్జ్వలభీము భీమవినుతున్ గారుణ్యసన్మూర్తి భా
సురలంకాప్రవిరాము రామధరణీశున్ సర్వసర్వంసహా
వరపుత్రీహృదయాంబుజాతతరణిన్ వాంఛించి సేవించెదన్.

తా. లంకను విరమింపఁజేసినవాఁడును, అనఁగా నశింపఁజేసినవాఁడును యుద్ధరంగములందు భయంకరుఁడును, పద్మములవంటి కన్నులుఁగలవాఁడును, రఘువంశమునకుమిత్రుఁడును, దయాస్వరూపుఁడును, కరుణయొక్కపూర్తిగలవాఁడును, అనఁగా, దయతో నిండినవాఁడును, అగు రామచంద్రుని శరణుపొందెదను.

శ్లో. రామచంద్ర మనిశం హృదయస్థం
రామ మిందువదనం ప్రవిభాసమ్,
భావయామి నిగమాంతనివాసం
భారతీపతినుతం భవవంద్యమ్. ౪౪

ఉ. శారదపూర్ణచంద్రవిలసద్వదనున్ రవికోటిభాసితున్
సారసగర్భసన్నుతుఁ బ్రశస్తచరిత్రుని నాగమాంతసం
చారు ధరాధరాధిపతిసన్నమితాంఘ్రిని మామకీనహృ
త్సారససంస్థితున్ వరదు దాశరథిన్ శరణంబు వేఁడెదన్.

తా. నా హృదయమునం దుండువాఁడును, రమింపఁజేయువాఁడును, చంద్రునివంటి మొగముగలవాఁడును, మిగులఁ బ్రకాశించువాఁడును, ఉపనిషత్తులయం దుండువాఁడును, బ్రహ్మచేఁ గొనియాడఁబడువాఁడును, శివునిచే నమస్కరింపఁదగువాఁడును, అగు శ్రీరామచంద్రుని ఎల్లప్పుడును భావనచేసికొనుచుందును.

పరమాత్మస్వరూపుఁడును, అగురాముఁడు జయించునుగాక. అనాథులకు నాథుఁడును, సీతాపతియును, అగు రాముఁడు జయించుఁగాక.

శ్లో. వరం వయాచే రఘునాథ యుష్మత్పాదాబ్జభక్తిస్సతతం మమాస్తు,
ఇదం ప్రియం నాథ వరం ప్రయచ్ఛ పునఃపునస్త్వామిద మేవ యాచే.

ఉ. శ్రీరఘునాథ మీపదసుసేవయు భక్తి నిరంతరంబు నా
కారయ నిష్టమైనవర మంతియె చాలును మాటిమాటికిన్
గోరెద నీవరంబు నినుఁగూరిచి యన్యవరంబు లెవ్వియుం
గోరను నాయభీష్ట మునఁగూర్పఁగదే కరుణించి మక్కువన్.

తా. ఓరఘునాథుఁడా! నేను వరమును యాచింతును. ఎల్లప్పుడును నాకు మీ పాదపద్మములయందు భక్తి యుండునుగాక. నాథా! నా కిష్టమయిన యీవరము నిమ్ము. మాటిమాటికిని నిన్నే నిదే యాచించెదను.

శ్లో. అంభోధిః కోపాదరుణాయమానే నాథస్యదృష్ట్వా నయనే రఘూణామ్,
మహత్తరత్రస్తమనాశశంకే మందాకినీమంగళసూత్రభంగమ్.

మ. ఘనకోపప్రకటప్రతాపయుతుఁడై కందోయిఁ గెంజాయఁ జెం
ద నదీనాథునిఁ గాంచినప్పుడు సుపర్వశ్రేణి శంకించె నీ
ఘనుచే భంగమునొందు నిశ్చయము గంగాహేమసూత్రంబు నేఁ
డనుచుం దద్విధవిక్రమంబు గలరామాధీశుఁ బ్రార్థించెదన్. ౫౧

తా. సముద్రునియందలి కోపమువలన నెఱ్ఱఁబారిన, రఘువంశనాథుఁ డగు రాముని కన్నులు చూచి యప్పుడే "సముద్రుని భార్యయగు మన మందాకినీనదియం గళసూత్రము తెగిపోవును" అని దేవత లందఱిచేతను యూహింపఁబడినది.

శ్లో. అంభోధిస్తంభబంధనేన జగదానందేన భూపుత్రికా
స్వాంతాంభోజసబాంధవేన నతరక్షాయత్తచిత్తేనచ,
కర్ణాలంబితకుండలేన దివిషత్త్రాణోద్యమేనాశ్రిత
శ్రేయః కల్పకనేన మే మతి రియం రామేణ సంవర్ధతామ్. ౫౨

మ. శ్రితకల్పద్రుమమై నతార్తిహరుఁడై సీతాహృదంభోజరం
జితపంకేరుహమిత్రుఁడై దివిజరాజత్రాణుఁడై వాహినీ
పతిరాడ్బంధనశౌర్యుఁడై త్రిభువనప్రహ్లాదుఁడై కుండలాం
చితుఁడౌ రాముఁడు మాకొసంగుఁగరుణా శ్రేయంబమేయంబుగన్

తా. సముద్రుని గర్వమును గట్టినవాఁడును, లోకముల నానందింపఁజేయు వాఁడును, భూమి కూఁతురైన సీతయొక్క హృదయమునందలి పద్మమునకు సూర్యుఁడును, తనకు నమ్రులయినవారిని రక్షించుటయందు ఉద్యుక్తమయిన మనస్సుగలవాఁడును, చెవులయందు వ్రేలాడుచున్న కుండలములు గలవాఁడును, దేవతలను రక్షించుటయందు వ్యాపారముగలవాఁడును తన్నాశ్రయించినవారికి మేలు గలిగించుటయందుఁ గల్పవృక్షమయినవాఁడును, అగు శ్రీరామునిచేతను నా యీ బుద్ధి వృద్ధిని పొందింపఁబడుఁగాక.

శ్లో. ఆదౌ రామతపోవనాదిగమనం యజ్ఞప్రతీపాలనం
శాపా దుద్ధరణం ధనుర్విదళనం సీతాంగనోద్వాహనమ్,
లంకాయా దహనం సముద్రతరణం సౌమిత్రిసమ్మోహనం
రక్షస్సంహరణం స్వరాజ్యగమనం చైతద్ధి రామాయణమ్. ౫౩

మ. మొదటన్ రామసముద్భవంబు నవనంబున్ గాచుటల్ మౌనివ
త్సదయుం బ్రోచుట చాపభంగము ధరిత్రీపుత్రియుద్వాహమున్
బిదపన్ లంకదహించుటల్ జలనిధిన్ దాఁటుటల్ భ్రాతృమూ
ర్ఛదశాస్యాదిమృతుల్ ధరావహనమే రామాయణంబై తగున్.

తా. మొదటను శ్రీరాముని జన్మము, కుమారులగు రామలక్ష్మణులు విశ్వామిత్రునివెంట పోవుట, అతనియజ్ఞమును గాపాడుట, అహల్యను శాపమునుండి యుద్ధరించుట, శివునివిల్లు విఱుచుట, సీతాదేవిని వివాహమాడుట, ఆంజనేయుఁడు లంకాపట్టణమును గాల్చుట, రాముఁడు వానరులతోఁగూడి సముద్రమును దాఁటుట, యుద్ధములో లక్ష్మణుఁడు మూర్ఛపోవుట, రావణాది రాక్షసులను జంపుట, తన రాజ్యమునకు-అయోధ్యకు మరలివచ్చుట, అనునివియే కదా! రామాయణము.

శ్లో. జన్మాదౌ క్రతురక్షణం మునివశే స్థాణోర్ధనుర్భంజనం
వైదేహీగ్రహణం పితుశ్చ వచనా ద్ఘోరాటవీగాహనమ్,
కోదండగ్రహణం ఖరాదిమథనం మాయామృగచ్ఛేదనం
బద్ధాబ్ధిక్రమణాం దశాస్యనిధనం చైతద్ధి రామాయణమ్. ౫౪

మ. ధర జనియించి నరుంబుఁ గాచి శిలఁ గాంతం జేసి విల్ ద్రుంచి భూ
వరపుత్రిన్ గొని తండ్రి పంప నటవీవాసంబు గావించి విల్
శరముల్దాల్చి ఖరాదులన్ దునిమి పే సారంగమున్ గూల్చివా
ర్ధి రహిన్ గట్టి దశాస్యుఁ ద్రుంచినదియే శ్రీరామచారిత్రమౌన్

తా. మొదటను రాముని జననము, మునీశ్వరుఁడయిన విశ్వామిత్రుని యజ్ఞమును సంరక్షించుట, ఈశ్వరుని ధనుస్సును విఱుచుట, జనకరాజు కూఁతురయిన సీతను వివాహమగుట, తండ్రియగు దశరథుని మాటవలన భయంకరమయిన దండకారణ్యమునందుఁ బ్రవేశించుట, ఇంద్రుఁ డగస్త్యునిద్వారమున నిచ్చిన ధనుస్సును పరిగ్రహించుట, ఖరుఁడు మొదలగు రాక్షసులను చంపుట, మాయాలేడిని చంపుట, సముద్రమును కట్టి దాఁటుట, రావణుని చంపుట-యనునివియే కదా! రామాయణము.

శ్లో. పూర్వం రామతపోవనానుగమనం హత్వా మృగం కాంచనం
వైదేహీహరణం జటాయుమరణం సుగ్రీవసంభాషణమ్,
వాలేర్నిగ్రహణం సముద్రతరణం లంకాపురీదాహనం
పశ్చాద్రావణకుంభకర్ణనిధనం హ్యేతద్ధి రామాయణమ్ ౫౧

మ. మును రాముండువనిం జరించి హరిణంబుం ద్రుంచి భూపుత్రి రేఁ
గినమార్గంబు జటాయుచేఁ గని సుగ్రీవాప్తుఁ డై వాలిమ
ర్దనుఁ డై వారిధి దాఁటి లంకను వసన్ దగ్ధంబుగావించి పో
ర నిశాటాధిపులన్ వధించినదియే రామాయణం బై తగున్.

తా. మొదటను శ్రీరాముఁడు తపోవనమునుగూర్చి పోవుట, బంగారులేడిని చంపుట, సీతను రావణుఁడు హరించుట, వానిచే జటాయువు మృతినొందుట, సుగ్రీవునితో మాటలాడుట, వాలినిచంపుట, సముద్రమును దాఁటుట, లంకాపట్టణమును కాల్చుట, తరువాతను రావణకుంభకర్ణులనుచంపుట అనునివియేకదా! రామాయణము.

శ్లో. శాంతం శారదచంద్రకోటిసదృశం చంద్రాభిరామాననం
చంద్రార్కాగ్నివికాసికుండలధరం చంద్రావతంసస్తుతమ్,
వీణాపుస్తకసాక్షసూత్రవిలసద్వ్యాఖ్యానముద్రాకరం
దేవేశం భరతాదిభిః పరివృతం రామం భజే శ్యామలమ్ ౫౨

మ. శరదబ్జారిసహస్రకోటిసదృశుం జంద్రాభిరామాననుం
హరసంస్తుత్యు సరోజబాంధవశశాంకాగ్నిప్రభాకుండలుం
వరదుం గోకవిపంచికాక్షవిలసద్వ్యాఖ్యానముద్రాకరుం
భరతాద్యావృతు శాంతు మేఘనిభు సంభావింతు రామప్రభున్.

శరత్కాలచంద్రులతో సమానుఁడును, చంద్రుని
ను, చంద్ర-సూర్యాగ్నులవలెఁ బ్రకా
ఁడు శిరోభూషణముగాఁగల శివునిచే
లతోను, ప్రకాశించు వ్యాఖ్యానము

ప్రతోఁను గూడినచేతులుగలవాఁడును, దేవతలచేఁ బ్రభువును, భరతుఁడు మొదలగు వారితోఁగూడినవాఁడును, నల్లనివాఁడును, అగు శ్రీరాముని సేవించుచుందును.

శ్లో. కృష్టం భీమధనుః కఠోరనినదం బ్రహ్మాదిసంవిస్మయం
భాస్వద్వాజిగతేరమార్గ మనిశం శంభోశ్శిరఃకంపనమ్,
దిగ్దంతిస్ఖలనం కులాద్రిచలనం సప్తార్ణవోన్మీలనం
వైదేహీమదనం మదాంధదమనం త్రైలోక్యసమ్మోహనమ్. ౫౭

మ. హరచాపధ్వని శబ్దజాదులును జోద్యం బంది రంభోనిధుల్
మొరసెన్ సీత ముదంబునొందె జగముల్ మోహంబుఁ జెందెన్ ధరా
ధరముల్ దిక్కరులుం జలించెను మదాంధవ్రాతముల్ గూలె భా
స్కరవాజుల్ గతి దప్పె శంభుఁడు శిరఃకంపంబుఁ జేసెన్ వెసన్.

తా. శివునిధనుస్సు, ఆకర్షింపఁబడినదై భయంకరమయినధ్వనిని గలిగించినది. బ్రహ్మాదులకు మిక్కిలి యాశ్చర్యమును గలిగించినది. సూర్యునిరథముగుఱ్ఱములను దారితప్పించినది. పలుమాఱు శివునిశిరస్సును కంపింపఁజేసినది. దిగ్గజములను ఒరగఁ జేసినది. సప్తకులపర్వతములను చలింపఁజేసినది. సప్తసముద్రములను క్షోభింపఁజేసినది. సీతను ముదింపఁజేసినది. గర్వముచేతను కన్నులు గానని వారిని అణఁచివైచినది. మూఁడులోకములను మోహింపఁజేసినది.

శ్లో. కంజాతపత్రాయతలోచనాయ
కర్ణావతంసోజ్జ్వలకుండలాయ,
కారుణ్యపాత్రాయ సువంశజాయ
నమోఽస్తు రామాయ సలక్ష్మణాయ. ౫౮

ఉ. శ్రీరమణీయసూర్యకులసింధుసుధాంశుసమానమూర్తికిన్
సారసపత్రనేత్రునకు సన్మణికుండలభాసమానశృం
గారకపోలయుగ్మునకుఁ గారుణికాగ్రణి కాశ్రితార్తిసం
హారికి లక్ష్మణాన్వితున కారఘురామున కేను మ్రొక్కెదన్.

తా. తామరరేకులవలె విశాలములయిన కన్నులు గలవాఁడును, చెవుల కలంకారములయి ప్రకాశించు కుండలములుగలవాఁడును, దయకుఁ బాత్రమయిన వాఁడును, మంచివంశమునందుఁ బుట్టినవాఁడును, లక్ష్మణునితోఁ గూడియుండువాఁడును అగు శ్రీరామునికొఱకు నమస్కారము గాక.

శ్లో. విద్యున్నిభాంభోదసువిగ్రహాయ
విద్యాధరైస్సంస్తుతసద్గుణాయ,

వీరావతారాయ విరోధిహంత్రే
నమోఽస్తు రామాయ సలక్ష్మణాయ. ౨౯

మ. ఘనవిద్యుత్ప్రవిభాసితాంగునకు విఖ్యాతోగ్రవీరావతా
రునకున్ శ్రీరఘురామచంద్రునకు నిర్ధూతారికిన్ సిద్ధదే
వనికాయస్తుతసద్గుణాకరునకున్ భక్తామరానోకహం
బునకున్ శ్రీపతికిన్ సలక్ష్మణునకున్ పాదంబునన్ మ్రొక్కెదన్.

తా. మెఱపుతో సమానముగఁ బ్రకాశించునదియు, మేఘమువలె నల్లనిదియు నగుశరీరము గలవాఁడును, విద్యాధరులచేతను చెప్పఁగాఁ గొనియాడఁబడు సుగుణములు గలవాఁడును, వీరావతార మూర్తినవాఁడును, విరోధులను చంపిన వాఁడును, లక్ష్మణునితోఁ గూడి యుండువాఁడును అగు శ్రీరామునికొఱకు నమస్కార మగుఁగాక.

శ్లో. సంసక్తదివ్యాయుధకార్ముకాయ
సముద్రగర్వాపహరాయుధాయ,
సుగ్రీవమిత్రాయ సురారిహంత్రే
నమోఽస్తు రామాయ సలక్ష్మణాయ. ౩౦

మ. శరదివ్యాస్త్రశరాసనోజ్జ్వలునకున్ వారాశిమర్యాదను
త్తరగర్వాపహదీప్తకాండునకు దైత్యధ్వంసికిన్ వాలిసో
దరసన్మిత్రునకున్ సలక్ష్మణునకున్ దాసార్తినిస్తారికిన్
హరికిన్ శ్రీరఘురామచంద్రునకు నేనశ్రాంతమున్ మ్రొక్కెదన్.

తా. దివ్యబాణములతోఁ గూడియున్న ధనుస్సుగలవాఁడును, సముద్రుని గర్వము నపహరించిన బాణముగలవాఁడును, సుగ్రీవుని స్నేహితుఁడును, దేవతలకు విరోధులయిన రాక్షసులను చంపినవాఁడును, లక్ష్మణునితోఁ గూడి యుండువాఁడును అగు శ్రీరామునికొఱకు నమస్కార మగుఁగాక.

శ్లో. పీతాంబరాలంకృతమధ్యకాయ పితామహేంద్రామరవందితాయ,
పిత్రే స్వభక్తస్య జనస్య మాత్రే నమోఽస్తు రామాయ సలక్ష్మణాయ.

మ. అరవిందాసనశైలనిర్దళనముఖ్యాదిత్యపూజ్యాంఘ్రిపం
కరుహద్వంద్వునకున్ సలక్ష్మణునకున్ స్వాభక్తకున్ గాంచనాం
బరసందీప్తకటిప్రదేశునకు రామస్వామికిన్ సేవకో
త్కరమాతాపితృసన్నిభాత్మునకు సద్భక్తిగా వినన్ మ్రొక్కెదన్

తా. పచ్చని కస్తూరిచేత నలంకరింపఁబడిన నడుముగలవాఁడును, బ్రహ్మేంద్రుఁడు మొదలగు దేవతలచేతను స్తోత్రముచేయఁబడినవాఁడును, తనయందు భక్తిగల జనములకుఁ దండ్రియు, తల్లియు నగువాఁడును, లక్ష్మణునితోఁ గూడి యుండువాఁడును అగు రామునికొఱకు నమస్కార మగుఁగాక.

శ్లో. నమోనమస్తేఽఖిలపూజితాయ నమోనమశ్చంద్రనిభాననాయ,
నమోనమస్తే రఘువంశజాయ నమోఽస్తు రామాయ సలక్ష్మణాయ.

చ. సకలజగజ్జనార్చితలసత్పదపద్మునకున్ బయోరుహా
ప్తకులసముద్రచంద్రునకుఁ బంకజనేత్రునకున్ ధరాధిపా
త్మజునకు లక్ష్మణాన్వితున కాస్యతిరస్కృతపద్మవైరికిన్
బ్రకటయశోవిశాలునకు రామున కేను నమస్కరించెదన్. ౭౨

తా. ఎల్లవారిచేతను వందనము చేయఁబడువాఁడవగు నీకొఱకు నమస్కారము. చందమామతో సమానమయిన మొగముగలవాఁడవగు నీకొఱకు నమస్కారము. రఘువంశమునందుఁ బుట్టినవాఁడవగు నీకొఱకు నమస్కారము. లక్ష్మణునితోఁ గూడినవాఁడవగు శ్రీరామా! నీకొఱకు నమస్కార మగుఁగాక.

శ్లో. ఇమాని పంచరత్నాని త్రిసంధ్యం యః పఠే న్నరః,
సర్వపాపవినిర్ముక్త స్స యాతి పరమాం గతిమ్. ౭౩

చ. అనుదినముం ద్రికాలములయందు దలిభక్తిని బంచరత్నముల్
జనులు పఠించినన్ దురితజాలవిమోచను లై యిహంబునం
దనయము సౌఖ్యసంపదల నంది ముదంబును జెంది యంతమం
దనుపమమోక్షముం గరతలామలకంబుగఁ గాంతు రెంతయున్.

తా. ఈ పంచరత్నములను మూఁడుసంధ్యలయందును ఏనరుఁడు పఠించునో అతఁడు సర్వపాపములచేతను విడువఁబడినవాఁడై యుత్తమగతిని పొందును.

శ్లో. శ్రీరామః కల్పవృక్షో మే విరామ స్సకలాపదామ్,
అభిరామ స్త్రిలోకానాం రామః క్షేమం కరోతు నః. ౭౪

చ. సరసిజమిత్రధాముఁడు నిశాచరభీముఁడు రాఘవుండు స
ద్వరభువనాభిరాముఁడు సుపర్వమహీరుహ మై మదీయదు
స్తరవిపదుత్కరంబును హతం బొనరించి నిరంతరంబు సు
స్థిరతరసౌఖ్యసంపదలు క్షేమ మొనర్చి కృతార్థుఁ జేయుతన్.

తా. శ్రీరాముఁడు నాకుఁ గల్పవృక్షము. నాయాపదల నన్నింటిని విరమింపఁ జేయువాఁడు. మూఁడు లోకములను సంతోషింపఁ జేయువాఁడు. అట్టి రాముఁడు మాకు క్షేమమును గలిగించునుగాక.

శ్లో. హృదయ! సదయచిత్తం చిత్తనాథం గుణానా
ముదధి మురుగుణాఢ్యం నిమ్నగాలంకృతాంఘ్రిమ్,
జనకపతితనూజాస్వాంతకాంతోత్పలస్య
స్ఫురణకిరణచంద్రం రామచన్ద్రం భజస్వ. ౬౫

ఉ. స్ఫారమణీమనోహృదయ♦కైరవకైరవమిత్రు భవ్యబృం
దారకవాహినీజనన♦నవ్యపదాంబుజుఁ జిత్తనాథు గం
భీరగుణామృతోదధి న♦మేయగుణాకరు భక్తవత్సలున్
శ్రీరఘురామభూభుజు భ♦జింతు నిరంతర మిష్టసిద్ధికిన్.

తా. ఓ మనసా! దయతోఁ గూడిన మనస్సుగలవాఁడును, చిత్తమునకు నాథుఁడును, గుణములకు సముద్రుఁడును, గొప్పగుణములచే నొప్పువాఁడును, గంగానదిచేతను అలంకరింపఁబడిన పాదములుగలవాఁడును, జనకరాజు కూఁతురయిన సీత యొక్క హృదయమనెడి చక్కని కలువను ప్రకాశించు కిరణములుగల చంద్రుని వంటివాఁడును అగు రామచంద్రుని భజింపుము.

శ్లో. వదతు వదతు వాణీ రామరామేతి నిత్యం
భజతు భజతు చిత్తం రామపాదారవిందమ్,
నమతు నమతు దేహం సంతతం రామచంద్రం
న భవతు మమ పాపం జన్మజన్మాంతరేషు. ౬౬

చ. సతతము రామరామ యని ♦ సంస్మరియింపుచు నుండుఁగాక సం
తతమును రామపాదనలి♦నద్వయమున్ భజియించుఁగాక స
న్మతి రఘురామచింతనము ♦ మాన కొనర్చునుగాక మద్వపుః
ప్రణతి యి ట్లైన జన్మకృత♦పాపసమాజము నన్నుఁ బొందునే.

తా. నా వాక్కు ఎల్లకాలము రామరామా! అని పలుకుచుండుఁగాక. నా చిత్తము ఎప్పుడును రాముని పాదపద్మములను భజించుచుండుఁగాక. నా దేహము సదా రామచంద్రుని గురించి మ్రొక్కుచుండునుగాక. నాకు జన్మజన్మాంతరములయందును పాపము లేకుండునుగాక.

శ్లో. చాపబాణధర స్సీతాకామదః కాంతిమా న్నరః,
సీతాలక్ష్మణసంయుక్తః పాతు మాం రాఘవేశ్వరః. ౬౭

మ. జనకాపత్యమనోరథప్రదుఁడు భా♦స్వన్మర్త్యసద్విగ్రహుం
డనఘుం డస్త్రిశరాసనాంచితమహా♦హస్తుండు సౌమిత్రిభా

తనయాశోభితపార్శ్వభాగుఁడు నమస్తక్షోణిపారాధ్యపా
ద్వనజద్వంద్వుఁడు రామభూధవుఁడు నిత్యంబున్ ననుం బ్రోవుతన్.

టీ. ధనుర్బాణములను ధరించినవాఁడును, సేవకోరికల నిచ్చినవాఁడును, కాంతి గలవాఁడును, మనుష్యాకారము గలవాఁడును, సీతాలక్ష్మణులతోఁ గూడి యుండువాఁడును, రాజశేఖరుఁడును అగు రాముఁడు నన్ను రక్షించుఁగాక.

శ్లో. ప్రాతః స్మరామి రఘునాథముఖారవిందం
మందస్మితం మధురభాషి విశాలఫాలమ్,
కర్ణావలంబిచలకుండలగండభాగం
కర్ణాంతదీర్ఘనయనం నయనాభిరామమ్. ౬౩

ఉ. సుందరమందహాసరుచిశోభితమై మధురోక్తియుక్తమై
కుందనసన్నిభస్ఫురితకుండలమండితమై విశాలకా
ర్ధేందునిభాళికం బయి రహించు దళనేత్రయుగాభిరామమై
యుండెడు గుల్కు రామువదనాబ్జము కల్యమునన్ స్మరించెదన్.

టీ. చిఱునగవు గలదియు, తియ్యఁగా మాట లాడునదియు, చెలువైన నుదురు గలదియు, చెవులయందు వ్రేలుచు-యూఁగుచుండెడి కుండలములు గల గండస్థలములు గలదియు, చెవులకంటను వ్యాపించిన పెద్దకన్నులు గలదియును, కన్నులకిష్టమయినదియును అగు రాముని ముఖపద్మమును ప్రాతఃకాలమున స్మరించుచుందును.

శ్లో. ప్రాత ర్భజామి రఘునాథకరారవిందం
రక్షోగణాయ భయదం వరదం నిజేభ్యః,
యద్రాజసంసది విభజ్య మహేశచాపం
సీతాకరగ్రహణమంగళ మాప సద్యః. ౬౪

చ. జనకసభాస్థలిన్ భవునిచాపము ఖండన మాచరించి యా
జనకసుతాకరగ్రహణసౌఖ్యము తక్షణ మొందినట్టిస
జ్జనవరదంబు దైత్యగణసాధ్వసదం బగురామచంద్రుపా
వనసుకరారవిందమును భక్తి భజింతు నహర్ముఖంబునన్

టీ. ఏది జనకరాజుసభయందు శివునిదైన ధనుస్సును ఖండించి వెంటనే సీతయొక్క పాణిగ్రహణ మనెడి మంగళమును పొందినదో, ఏది రాక్షస గణమునకు భయమును గలిగించినదో, ఏది తనవారికి వరముల నిచ్చినదియో, అట్టి రాముని హస్తపద్మమును ప్రాతఃకాలమునందు సేవించుచుందును.

శ్లో. ప్రాతర్నమామి రఘునాథపదారవిందం
పద్మాంకుశాదిశుభరేఖశుభావహం చ,
యోగీంద్రమానసమధువ్రతసేవ్యమానం
శాపాపహం సపది గౌతమధర్మపత్న్యాః. ౭౦

మ. అరవిందాంకుశశంఖముఖ్యశుభరేఖాలంకృతంబై మనో
హరమై యోగిమనోమధువ్రతనిషేవ్యంబై యహల్యాసతీ
దురితాంతోపలరూపశాపఫలనిర్ధూతప్రభావప్రభా
కర మా రామపదాంబుజద్వయము నమస్కారాలంబుగ మ్రొక్కెదన్.

తా. పద్మము-అంకుశము మొదలయిన శుభప్రదములయిన రేఖలుగలదియై శుభములను గలిగించుచుండునదియు, యోగీంద్రుల మనస్సులనెడి తుమ్మెదలచేతను సేవింపఁబడునదియు, గౌతముని భార్యయగు-అహల్యయొక్క శాపమును వెంటనే తొలఁగించినదియునగు రాముని పాదపద్మమును ప్రొద్దున మ్రొక్కెదను.

శ్లో. ప్రాతర్వదామి వచసా రఘునాథనామ
వాగ్దోషహారి సకలం కలుషం నిహంతృ,
యత్పార్వతీ స్వపతినా సహ భోక్తుకామా
ప్రీత్యా సహస్రహరినామసమం జజాప. ౭౧

మ. దురితస్తోమవినాశమై ప్రబలవాగ్దోషాపహంబై రమే
శ్వరసాహస్రసమాఖ్యతుల్యమగు నేనంబై జపించుగా మహే
శ్వరి మోదంబున భర్తృయుక్తముగఁ గాంక్షల్ గల్గి యారాఘవే
శ్వరునామంబు వచింతుఁ గల్యమున నే సద్భక్తియుక్తుండనై.

తా. వాచాదోషములను హరించునదియు, ఎల్లపాపముల నిర్మూలించునదియు నగు నేనామమును తనభర్తయగు శివునితోఁగూడఁ బార్వతి, యనుభవింపఁ గోరిక గలదియై ప్రీతిచేతను వేయివిష్ణునామములతో సమానముగ జపము చేయుచుండునో అట్టి రాముని నామమును వాక్కుచేఁ బ్రొద్దున పల్కుదును.

శ్లో. ప్రాతః శ్రయే శ్రుతినుతాం రఘునాథమూర్తిం
నీలాంబుజోత్పలసితేతరరత్ననీలామ్,
ఆముక్తమౌక్తికవిశేషవిభూషణాఢ్యాం
ధ్యేయాం సమస్తమునిభిర్జనభృత్యముఖ్యైః. ౭౨

ఉ. నీలమణిప్రభాధరవి♦నీలము తాపసముఖ్యసేవ్యమై
పాలితభృత్యవార మయి ♦ భవ్యశ్రుతిస్తుతమై సుమూర్తిశా
జాలవిభూషణాఢ్య మగు♦జానకివల్లభమూర్తిఁ బ్రత్యహః
కాలమునందు నాశ్రయతఁ ♦ గాంచఁ దలంచెద నిష్టసిద్ధికిన్.

తా. వేదములచేఁ గొనియాడఁబడునదియు, నల్లని మేఘమువలెను, కలువల వలెను, ఇంద్రనీలమణివలెను నల్లనైనదియు, కూర్పఁబడిన మూర్తి విశేషములుంగల నగలతో నొప్పునదియు, సకలమునులచేతను తనముఖ్యభృత్యులచేతను ధ్యానింపఁ దగినదియు నగు రాముని మూర్తిని ప్రొద్దున నాశ్రయించెదను.

శ్లో. యశ్శ్లోకపంచక మిదం నియతః పఠేత
నిత్యం ప్రభాతసమయే పురుషః ప్రబుద్ధః,
శ్రీరామకింకరజనేషు స ఏవ ముఖ్యో
భూత్వా ప్రయాతి హరిలోక మనన్యలభ్యమ్. 23

మ. అనిశం బీనరుఁడైన నీయయిదుప♦ద్యంబుల్ ప్రభాతంబునం
దున మేల్కాంచి పఠించునేని యతఁ డెం♦తో పుణ్యుఁడై రామపా
వనపాదాశ్రితుఁడై యనన్యజనల♦భ్యంబై మహానందమై
ఘనతేజోమయమై వెలుంగుహరిలో♦కప్రాప్తిఁ గన్గొం డగున్.

తా. ఏపురుషుఁడు ప్రతిరోజును ప్రాతఃకాలమున మేలుకొన్న వాఁడై, శుచియై యీయైదు శ్లోకములను పఠించుచుండునో, అతఁడే శ్రీరాముని భక్తులయందు మొదటివాఁడై యితరులకు దొరకని విష్ణులోకమును పొందును.

శ్లో. కిం మంత్రైర్బహుభిశ్చ దుష్కరఫలై రాయాసదై స్తద్విదాం
కించిల్లోపవిధానమాత్రవిఫలై స్సంసారదుఃఖావహైః,
ఏక స్సన్నపి సర్వమంత్రఫలదో దోషోజ్ఝిత స్సర్వథా
'శ్రీరామ శ్శరణం మమే'తి పరమో మంత్రోఽయ మష్టాక్షరః ౨౪.

శా. ఆరూఢంబుగ సర్వమంత్రఫలదం♦బై మోక్షదంబై నయా
"శ్రీరామ శ్శరణం మమే"తి యనఁగాఁ ♦ వెల్గొన్నయష్టాక్షరిం
గోరంగాఁ దగు మంత్రలోకమునఁ గో♦ర్కుల్ హీనమై దుష్కర
ప్రారంభంబు లసాధ్యమై ప్రబలదు♦ర్దాంతప్రవిస్తారసం
సారార్త్యావహమైన మంత్రతతికాం♦క్షల్ సేయఁగా నేటికిన్.

తా. దుష్కరము లయిన ఫలములు గలవియు, వాని సాధించినవారి కాయాసము నిచ్చునవియు, కొంచెము లోపము గలిగినంతమాత్రమున విఫలము లగునవియు,

సంసారదుఃఖమును గలిగించునవియు నగు చెడ్డమంత్రములచే నేమి ప్రయోజనము? ఒకటియై యుండినప్పటికిని సర్వమంత్రములను ఇచ్ఛాఫలముల నిచ్చునదియు, సర్వవిధములచేతను దోషము లేనిదియు, అగు "శ్రీరామశ్శరణం మమ" అను గొప్ప మంత్రము, ఎనిమిది యక్షరములుగలది కలదుగదా.

శ్లో. రామభద్రాశ్రయా స్సాక్షా ద్రామభద్రో న సంశయః,
తత్ర కోదండతూణీరా యత్ర దండకమండలూ. ౭౫

ఉ. శ్రీరఘురామసత్పదకుశేశయయుగ్మము నాశ్రయించువాఁ
డారఘురామచంద్రసముఁడై చెలువొందును సందియంబు లే
దారఘువీరుఁ డెప్పుడు శరాసనబాణధరుం డితండు సా
ధారణరీతిఁ బాణిధృతదండకమండలుఁడై ప్రవర్తిలున్.

తా. రామభద్రు నాశ్రయించినవాఁడు సాక్షాత్తుగా రామభద్రుఁడే అగును. సందేహము లేదు. అక్కడ ధనుస్సు-అమ్ములపొదులు ఉన్నవి. ఇక్కడ దండము-కమండలువు ఉన్నవి.

శ్లో. రఘునాథపదారవిందయోస్తే భ్రమరీభూత మఘాంధకారసూర్య,
అపరాధశతాలయం తథా మామనుగృహ్ణాసి హి మంగళైః కటాక్షైః.

మ. నలినాప్తాన్వయసింధుచంద్ర ధరణీనాథా రఘుగ్రామణీ
కలుషధ్వాంతపతంగ రామ తవపత్కంజాతసారంగ మై
కలితాలం బపరాధకోటులకు నిక్కం బాలయం బైన న
న్నలమంగా భద్రము లౌకటాక్షములతో వీక్షించు టింకెన్నఁడో.

తా. పాపములనెడి చిమ్మచీఁకటికి సూర్యుఁడ వగునో రఘునాథా రామా! నీపాదపద్మములయందుఁ దుమ్మెదవలె నున్నవాఁడను, వందలకొలఁది-అపరాధములకు స్థానమును, అగునన్ను మంగళప్రదములయిన నీకటాక్షములచే నీవలెనే అనుగ్రహించుచున్నావుగదా!

శ్లో. రామరామ తవ నామ జపంతః పామరా అపి తరంతి భవాబ్ధిమ్,
అంగసంగిభవదంగుళిముద్రః కిం విచిత్ర మతరత్కపి రబ్ధిమ్. ౭౭

ఉ. పామరు లైనఁగాని తమపావననామజపం బొనర్చినన్
బ్రేమ భవాంబురాశిని దరింతురు తావక మంగుళీయకం
బామిషఁ జేతఁ బూనినమహాత్త్వమునన్ బ్రకటోర్మిమాలికా
భీమపయోధిఁ గ్రోఁతి యతివేగ తరించుట చిత్ర మెట్లగున్!

తా. రామా రామా! నీనామమును జపించువారు పామరులయినను సంసారసముద్రమును తరించుచున్నారు. శరీరమునకు దగిలియున్న నీయుంగరముగలవాఁడగు క్రోఁతి (హనుమంతుఁడు) సముద్రమును దాఁటె నన్న నిం దేమివింత యున్నది?

శ్లో. శ్రీరామనామామృతమంత్రబీజం సంజీవనం చేన్మనసి ప్రతిష్ఠమ్,
హాలాహలం వా ప్రళయానలం వా మృత్యోర్ముఖం వా విశతీకరోతి. ౭౮

శా. శ్రీరామాక్షరమంత్రనిర్మలసుధాసిక్తాత్ముఁ డైనట్టియా
ధీరాగ్రేసరచక్రవర్తిని సముద్దీప్తోగ్రకల్పాగ్నిదు
ర్వారోదగ్రహలాహలం బమితసర్వగ్రాసి యై సాధ్వసా
కారం బై తగుమృత్యువక్త్రములు నేకాలంబునన్ జెందునే.

తా. శ్రీరామనామామృతమంత్రబీజము, సంజీవింపఁజేయునది. అది మనస్సులోఁ బ్రతిష్ఠింపఁబడియుండినపక్షమున, హాలాహలమును గాని, ప్రళయాగ్నిని గాని, మృత్యుముఖమును గాని వ్యర్థము గాఁ జేయుచుండును.

శ్లో. హా కృష్ణాచ్యుత హా కృపాలయ హరే హా పాండవానాం సఖే
క్వాసి క్వాసి సుయోధనాద్యపహృతాం హా రక్ష మాం ద్రౌపదీమ్,
ఇత్యుక్తోఽక్షయవస్త్రరక్షితతనుం యోఽరక్ష దాపద్గతాం
మార్తత్రాణపరాయణ స్స భగవాన్నారాయణో మే గతిః. ౭౯

ఉ. కౌరవనాథుఁ డాద్రుపదకన్యకవస్త్రము లూడ్చుచుండ నో
కారుణికాగ్రగణ్య రిపుఘస్మర పాండవపక్ష యార్త నై
యారడిఁ బొందుచున్నఁ గృప నారయు మంచనఁ దక్షణంబునం
దారసి ప్రోచినట్టిహరి యార్తశరణ్యుఁడు మాకు దిక్కగున్.

తా. “హా! కృష్ణా! అచ్యుతా! హా! కృపాలయా! హరీ! హా! పాండవమిత్రుఁడా! ఎక్కడ నున్నా వెక్కడనున్నావు? దుర్యోధనాదులచే నవమానింపఁబడుచున్నదానను, హా! నన్ను రక్షింపుము—ద్రౌపదిని”, అని పలుకఁబడినవాఁడై అక్షయమయిన వస్త్రములచేతను రక్షింపఁబడిన శరీరముగలదానిని, ఆపదను పొందినదానిని ద్రౌపది నెవఁడు రక్షించెనో ఆర్తులను రక్షించుటయం దాసక్తుఁడును, భగవంతుఁడును అగు—ఆనారాయణుఁడే నాకు దిక్కు.

శ్లో. ఇందీవరదళశ్యామ మిందుకోటినిభాననమ్,
కందర్పకోటిలావణ్యం వందేఽహం రఘునందనమ్. ౮౦

చ. అమలసుధాకరాయుతసహస్రనిభాస్యునకున్ హృతారికిన్
గమలసమాననేత్రునకుఁ గాంచనచేలవిభాసిమూర్తికిన్

సుమశరకోటికోటినిభ సుందరమూర్తికి భవ్యకీర్తికిన్
శమదమవర్తికిన్ సుగుణశాలికి రాముని నేను మ్రొక్కెదన్.

తా. నల్లగలువలవంటి నల్లనివాఁడును, కోటిచంద్రులతో సమానమయినసౌఖ్యముగలవాఁడును, కోటిమన్మథులశరీరసౌందర్యముగలవాఁడును, అసురభంజనుని రాముని నేను మ్రొక్కుచున్నాను.

శ్లో. కిం యోగశాస్త్రైః కిము వేదవిద్యయా కిం యాగగంగాదివిశేషతీర్థైః,
కిం బ్రహ్మచర్యాశ్రమసంచరేణ భక్తిర్నచేత్తే రఘువంశకీర్త్యాన్.

మ. వరగంగాదివిశేషతీర్థములసేవల్ సేయఁగా నేల సు
స్థిరయోగంబులు సర్వవిద్యలు మఖాదిప్రక్రియాయుక్తదు
ష్కరశాస్త్రంబులు నాలుగాశ్రమములుం గాంక్షింపఁగా నేల భా
స్కరవంశుండగు రామచంద్రవిభునిన్ సద్భక్తిఁ గీర్తించినన్. ౧౮

తా. ఓరఘువంశసంభవా! రామా! నీకీర్తియందు భక్తి లేకపోయిన పక్షమున, యోగశాస్త్రములచే నేమిప్రయోజనము? ఎల్లవిద్యలచే నేమిప్రయోజనము? యాగములచేతను, గంగ మొదలగు విశేషతీర్థములచేతను నేమిప్రయోజనము? బ్రహ్మచర్యాశ్రమసంచారముచేత నేమిప్రయోజనము?

శ్లో. హే రామభద్రాశ్రయ హే కృపాళో హే భక్తలోకైకశరణ్యమూర్తే
పునీహి మాం త్వచ్చరణారవిందం జగత్పవిత్రం శరణం మమాస్తు

ఉ. ఓరఘురామభద్ర హరి యోకరుణాంబుధి యోధరిత్రిపు
త్రీరమణాబ్జలోచన సుధీజనజాలశరణ్యమూర్తి యో
సారసగర్భచంద్రధరసన్నుత లోకపవిత్రమైననీ
చారుపదాబ్జము ల్గొలుతు సన్నుతి నన్నుఁ బవిత్రుఁ జేయవే. ౧౯

తా. ఓరామభద్రా! ఆశ్రయా! ఓదయాళుఁడా! ఓభక్తులకు ముఖ్యరక్షకమూర్తీ! నన్నుఁ బవిత్రునిగఁ జేయుము. లోకములను పవిత్రముగఁ జేయునీపాదద్వయములు నాకు శరణముగుఁగాక.

శ్లో. శ్రీరామచంద్రే శ్రితయోగిచంద్రే
ప్రసన్నమూర్తౌ పరిదృశ్యమానే,
తాపత్రయం నాశముపైతి పుంసాం
తమోంధకారం వినిహంతు సద్యః. ౨

మ. స్థిరయోగీంద్రసమాశ్రితాంఘ్రియుగునా◆శ్రీరామచంద్రాకృతిన్
బరికింపం దగునట్టిపూరుషులకున్ ◆ దాపత్రయం బప్పుడే
పరిహార్యం బగు నేను నే ననెడిమో◆హ్యాంధకారంబు ని
ర్హరణం బౌ నని సత్య మీజగతి నా◆రాముఁ బ్రశంసించెదన్.

తా. తన్నాశ్రయించినవారలకు ఆహ్లాదమును గలిగించువాఁడును, ప్రసన్నమయిన మూర్తిగలవాఁడును అగు శ్రీరామచంద్రుఁడు కనుపడుచుండఁగాఁ బురుషులకుఁ ఆధ్యాత్మికము, ఆధిభౌతికము, ఆధిదైవికము అను తాపత్రయము నాశమును పొందును. అట్టిరాముఁడు వెంటనే నాయజ్ఞానాంధకారమును పోఁగొట్టును గాక.

శ్లో. నీలాభ్రదేహ నిఖిలేశ జగన్నివాస
రాజీవనేత్ర రమణీయగుణాభిరామ,
శ్రీరామ దైత్యకులమర్దన రామచంద్ర
త్వత్పాదపద్మ మనిశం కలయామి చిత్తే. ౮౪

ఉ. నీలఘనాఘనాంగ రమ◆ణీయ గుణాకర రామ సర్వలో
కాలయ దైత్యవంశగహ◆నానల కంజదళాయతాక్ష భూ
పాలలలామ రాఘవ శు◆భప్రద సర్వవిభూ ధరాసుతా
లాలస నీపదాంబుజము◆లన్ హృదయంబునఁ గాంచ నెంచెదన్.

తా. నీలమేఘమువంటి శరీరముగలవాఁడవును, సమస్తమునకును ప్రభుడవును, లోకముల కాధారమవును, పద్మములవంటి నేత్రములుగలవాఁడవును, చక్కని గుణములచే మనోహరుఁడవును, రాక్షసులను మర్దించినవాఁడవును, అగురామా! రామచంద్రా! నీపాదపద్మములు సదా చిత్తమునందు స్మరించుచుందును.

శ్లో. కువలయదళనీలః పీతవాసాః స్మితాస్యో
వివిధరుచిరభూషాభూషితో దివ్యమూర్తిః,
దశరథకులనాథో జానకీప్రాణనాథో
నివసతు మమ చిత్తే సర్వదా రామచంద్రః. ౮౫

చ. కువలయపత్రనీలఘన◆కోమలవర్ణుఁడు దివ్యమూర్తి భూ
ధవుఁడు వినూత్నరత్నమణి◆కానవిభూషణభూషితుండు రా
ఘవకులవర్ధనుండు నవ◆కాంచనచేలుఁడు భూమిపుత్రికా
ధవుఁడు దరస్మితాస్యుఁడు ము◆దంబున వర్తిలు మన్మనంబునన్.

తా. కలువరేకువలె నల్లనివాఁడును, పచ్చనివస్త్రముగలవాఁడును, చిఱునగవుతోడిమొగముగలవాఁడును, అనేకవిధములయిన చక్కనినగలచే నలంకరింపఁబడిన

వాఁడును, దివ్యమయిన మూర్తిగలవాఁడును, దశరథుని వంశమునకు నాథుఁడును, జానకీప్రాణములకుఁ బ్రభువును అగు శ్రీరామచంద్రుఁడు సర్వకాలములయందును నామనములో నివసించుఁగాక.

శ్లో. సజలజలదనీలం సన్మునిస్తుత్యలీలం
సుగమనిగమమూలం యాతుధానాంతకాలమ్,
దశరథనృపబాలం సత్కృపాపూర్ణలోలం
భజతు భువనఖేలం భక్తసంస్తుత్యశీలమ్. ౮౩

చ. సజలమేఘనీలు మునిసన్నుతశీలుఁ గృపాలవాలు సే
వకజనపాలు దేవరిపువర్గవినాశనహేతుకాలునిన్
బ్రకటసరోజజాండపరిపాలనఖేలనశీలు నాశ్రితా
వకవరపాలు సర్వశ్రుతిపాళికమూలుని రాముఁ గొల్చెదన్.

తా. నీటితో నిండిన మేఘమువలె నల్లనివాఁడును, సత్పురుషులచేఁ గొనియాడఁదగినలీలలుగలవాఁడును, సుగమములయిన వేదముల కాదికారణమును, రాక్షసులకు మృత్యుకాలస్వరూపుఁడును, దశరథరాజబాలుఁడును, మంచిదయతో నిండినవాఁడును, భక్తులయం దాశ గలవాఁడును, లోకములయందు నటించువాఁడును, భక్తులచే సన్నుతింపఁదగిన స్వభావముగలవాఁడును అగు రాముని నామనము సేవించుఁగాక.

శ్లో. దశరథవరపుత్రం జానకీసత్కళత్రం
దశముఖహరదక్షం పద్మపత్రాయతాక్షమ్,
కరధృతశరచాపం చారుముక్తాకలాపం
రఘుకులజవరేణ్యం రామ మీడే శరణ్యమ్. ౮౪

చ. దశరథరాజపుత్త్రు వసుధాతనయామకళత్త్రు శాంతునిన్
దశముఖదైత్యశత్త్రు నవతామరసాయతపత్త్రనేత్త్రునిన్
పశుపతిమిత్త్రుఁ జాపవరబాణకరున్ రఘువంశదీపకున్
శశిముఖు మౌక్తికాభరణు సర్వగు రాము సమాశ్రయించెదన్.

తా. దశరథుని పెద్దకొడుకును, జానకియే మంచిభార్యగాఁగలవాఁడును రావణుని సంహరించుటలో నేర్పుగలవాఁడును, తామరరేకులవలె విశాలములయిన కన్నులుగలవాఁడును, చేతితో ధనుర్బాణములను ధరించినవాఁడును, చక్కనిముత్యాలసరులు గలవాఁడును, రఘువంశపురాజులలో శ్రేష్ఠుఁడును, రక్షకుఁడును అగు రాముని స్తుతించెదను.

• రామం పీఠాసనస్థం విమలరవినిభం భాసమానస్వరూపం
శ్యామం సీతాసమేతం స్మితరుచిరముఖం కుండలోద్దీప్తగండమ్,
శ్రీవత్సశ్రీనివాసం సురవిటపితటన్యస్తసింహాసనస్థం
దివ్యాకల్పోజ్జ్వలాంగం దివిజపతినుతం ధ్యానయుక్తేన యుఞ్జ్యే. ౮౮

౨. సురభూజాంతికసింహపీఠనిలయుఁ • సూర్యప్రకాశుఁ ధరా
వరపుత్త్రీయుతు భాసమానతను శ్రీ•వత్సాంకు పీఠాసన
స్థితు శక్రస్తుతు శ్రీనివాసు మణిరా•జభ్రాజితాకల్పు సుం
దరమందస్మితవక్త్రు నీలనిభు ధ్యా•నాధ్వర్యుఁ దగ నెంచెదన్.

తా. పీఠాసనమునం దున్నవాఁడును, నిర్మలుఁ డయినసూర్యునితో సమానుఁ
డును, ప్రకాశించుచున్న స్వరూపముగలవాఁడును, నల్లనివాఁడును, సీతాసహితుఁ
డును, చిఱునగవుచేతను చక్కనైనమోముగలవాఁడును, కుండలములచేఁ బ్రకా
శముఁ జేయఁబడినచెక్కులు గలవాఁడును, శ్రీవత్సమనెడు—లక్ష్మికిని నివాసస్థాన
మును, కల్పవృక్షముక్రిందను ఉంచఁబడిన సింహాసనమునం దున్నవాఁడును, దివ్యము
లయిన నగలచేఁ బ్రకాశించునవయవములుగలవాఁడును, దేవేంద్రునిచే స్తుతింపఁ
బడినవాఁడును, అగు రాముని ధ్యానముసేసి యజ్ఞముచేసెదను యజించెదను.

శ్లో. శ్రీరామభద్రాశ్రితసద్గురూణాం పాదారవిందం భజతాం నరాణామ్,
ఆరోగ్య మైశ్వర్య మనంతకీర్తి రంతేచ విష్ణోః పద మస్తి సత్యమ్.

౩. శ్రీరఘురామపాదసరసీజసమాశ్రితసజ్జనాంఘ్రిపం
కేరుహసేవకాళికి సు•కీర్తి విభూతి నిరామయంబు వి
స్తారతరాయువుం గలిగి • ధన్యత నొంది యనంతరంబునన్
సారసనేత్రుఁ డైనహరి•సన్నిధి గల్గుట సత్య మింతయున్. ౮౯

తా. శ్రీరామభద్రుని ఆశ్రయించినవారైన సద్గురువులయొక్క పాదపద్మము
లను సేవించునరులకు, ఆరోగ్యము, ఐశ్వర్యము, అంతములేనికీర్తి, అంతమందు విష్ణు
పదము ఉన్నది. ఇది నిజము. (రామభక్తులభక్తులకే ఆరోగ్యాదులు గలుగుచుం
డఁగా నింక రామభక్తులసంగతి చెప్పవలయునా యనుట)

శ్లో. రణహతదనుజేంద్రో రాజరాజాత్తచంద్ర
స్సముదరిపుమృగేంద్ర స్సన్మనోంభోధిచంద్రః,
లలితభువనచంద్రో లక్ష్మణానందసాంద్రో
మహితసుజనచంద్రో మైథిలీప్రాణచంద్రః. ౯౦

ఉ. మానిహృదబ్ధిచంద్రు రణ♦మర్దితరాత్రిచరేంద్రు జానకీ
జాని నరేంద్రచంద్రు రిపు♦జాలమృగేంద్రుని లక్ష్మణప్రమా
దానయు రాజరాజహృద♦యప్రవిభాసితచంద్రు భక్తసం
తానసురద్రుమంబు రఘు♦నందను రాము సమాశ్రయించెదన్.

తా. యుద్ధములో రావణుని చంపినవాఁడును, రాజాధిరాజులమనస్సుల కాహ్లాదమును గలిగించువాఁడును, మదించినశత్రువులకు సింహమువంటివాఁడును, సుజనుల మనస్సులనెడి సముద్రమునకుఁ జంద్రుఁడును, చక్రవర్తియైనవాఁడును, గొప్పవాఁడును, రాజును, లక్ష్మణునియానందముచేతను ఘనుఁడును, పూజ్యుఁడును, సుజనులను సంతోషింపఁజేయువాఁడును, పితృప్రాణముల నానందింపఁజేయువాఁడును అగురాముఁడు నా కాశ్రయింపఁదగువాఁడు.

శ్లో. నమః కోదండహస్తాయ సందీపితశరాయ చ,
దండితాఖిలదైత్యాయ రామాయాపన్నివారిణే. ౯౧

ఉ. మానితహస్తమందు నగ♦మానశరాసముఁ బూని బాణసం
ధానముఁ జేసి దానవవి♦తానము నెల్ల వధించినట్టి సీ
తానయనోత్పలాంచితసు♦ధాకరదీప్తికి రామమూర్తికిన్
ధీనిధి కార్తిహారి కతి♦నిర్మలభక్తి నమస్కరించెదన్.

తా. ధనుస్సుహస్తమునఁ గలవాఁడును, ప్రకాశింపఁజేయఁబడిన బాణములుగలవాఁడును, సర్వరాక్షసులను దండించినవాఁడును, ఆపదలను నివారించువాఁడును అగు శ్రీరామునకు నమస్కారము.

శ్లో. న జానన్ జానకీజానిం రామం తత్త్వమపి ప్రభుమ్,
ధిక్కార్యా ద్యమదూతాన్ యో నరస్తత్త్వ విహాహతే. ౯౨

చ. ధరణిసుతాధినాథుఁ డగు♦దాశరథిన్ రఘురాముఁ జిత్తమం
దెఱుఁగక యున్న నయ్యనకు♦లేశ్వరతత్త్వమునందుఁ గాంతు సు
స్థిరమతిఁ గల్గువారలు ప్ర♦సిద్ధముగా యమదూతలన్ దిర
స్కరణముఁ జేతు రట్టిత్రిజ♦గత్ప్రభు నెంచి భజింతు నిత్యమున్.

తా. జానకి భార్యగాఁగలవాఁడును, బ్రహ్మస్వరూపుఁడును, ప్రభువును అగు శ్రీరాముని నెఱుఁగనివాఁ డయినను, ఏనరుఁ డాయన తత్త్వమును తెలియఁగోరునో. అతఁడు యమదూతలను ధిక్కరించును. (రామభక్తులదరికి యమదూతలు రారు.)

శ్లో. రామో మే హృది సన్నిధిం రచయతాం రామం భజే దుష్కృతం
రామేణాపహృతం నమో భగవతే రామాయ రామాచ్ఛుభమ్,

లతే శ్రీరఘునందనస్య సుకృతే ర్ధాసోఽస్త్వహం సర్వదా
నిత్యం కోసలకన్యకా ప్రియసుతే రామే మనో వర్తతామ్. ౯౩

ఉ. రాముఁడు నిల్చు హృత్స్థలిని రాము నహర్నిశమున్ భజింతు శ్రీ
రామునిచే నఘం బణఁగు రామునికై నతు లే నొనర్తు శ్రీ
రామునివల్ల భద్రము మగు రామునకున్ బరిచర్యఁ జేసెదన్
రామునియందు నామది నిరంతర మేమర కే ప్రవర్తిలున్.

తా. రాముఁడు నాహృదయమునందు సన్నిధిని చేయుఁగాక. (అనఁగా, నామనస్సులో నుండుఁగాక) నేను రాముని సేవించుచుందును. రాముని చేతను నా పాపము హరింపఁబడినది. భగవానుఁడయిన శ్రీరామునికి నాకు నమస్కారము. రాముని వలన శుభము నూహించుచున్నాను. నామనసెల్లప్పుడును పుణ్యాత్ముఁడును, కౌసల్యకుమారుఁడునునైన శ్రీరామునియందు నిత్యము ప్రవర్తించుచుండుఁగాక.

శ్లో. కోదండనిర్ముక్తశరాగ్రఖండనం ప్రచండశశ్వద్భుజదండమండనమ్,
అఖండచండాంశుసమానచండనం భజామి రామం రణరంగమండనమ్.

చ. సమదభుజాబలాఢ్యులగు శత్రుల నైజధనుర్విముక్తబా
ణముల వధించి తీక్ష్ణకిరణప్రవిభాసితచండమూర్తి యై
సమరధరాభిరాముఁ డయి సజ్జనబృందసుపర్వభూజ మై
యమరినరామభూధవు నహర్నిశమున్ భజియించుచుండెదన్. ౯౪

తా. ధనుస్సునుండి బయలుదేఱిన బాణముల యగ్రములచేతను ఖండించువాఁడును, శత్రువులవిషయమున మిగులఁ దీక్ష్ణుఁడును, శాశ్వతమును అగు బాహుదండము చేతను ప్రకాశించువాఁడును, అఖండుఁ డయినసూర్యునితో సమానమయిన తైక్ష్ణ్యము గలవాఁడును, యుద్ధరంగమున కలంకారమును అగురాముని సేవించెదను.

శ్లో. సింహాసనస్థం మునిసిద్ధసేవ్యం రక్తోత్పలాలంకృతపాదపద్మమ్,
సీతాసమేతం శశిసూర్యనేత్రం రామం భజే రాఘవరామచంద్రమ్.

మ. రవిశైత్యాత్మకనేత్రుఁ డై మునిసుపర్వశ్రేణిసంసేవ్యుఁ డై
నవరత్నోజ్జ్వలపీఠికోల్లసితుఁ డై నవ్యస్ఫుటాంభోజకై
రవసంపూజితపాదపద్ముఁ డయి భూరామాసుతాయుక్తుఁ డై
భువనేశుం డగురామభూభుజు హృదంభోజంబునన్ గొల్చెదన్.

తా. సింహాసనమునందున్నవాఁడును, మునులచేతను, సిద్ధులచేతను సేవింపఁదగు వాఁడును, ఎఱ్ఱఁగలువలచేత నలంకరింపఁబడిన పాదపద్మములు గలవాఁడును, సీతతోఁ

గూడియుండువాఁడును, చంద్రుఁడును సూర్యుఁడును నేత్రములుగాఁ గలవాఁడు అగు రాఘవరామచంద్రుని రాముని సేవించెదను.

శ్లో. దయారూపే భూపే రఘుకులకలాపే సుహృదయే
భుజాస్తంభే దంభేతరవిజయకుంభే విహరతామ్,
మహావీరే ధీరే దశరథకుమారే పరిసర
ద్గుణారామే రామే దశముఖవిరామే మమ మనః. ౯౪

మ. సనయుండై ధరణీశుఁడై సుహృదుఁడై ♦ సర్వాత్ముఁడై ధీరుఁడై
మదమత్తారివిఖండచండభుజుఁడై ♦ మార్తాండవంశాబ్ధిప్రా
గుదితాబ్జుండయి యాజిశూరుఁడయి యా♦మ్యుండై దశాస్యాద్రిభి
ద్భిదురంబౌ రఘురాముసం దెపుసునా♦వేశించు మత్స్వాంతమాన్.

తా. నాయనస్సు, దయాస్వరూపుఁడును, భూమిని పాలించినవాఁడును, రఘువంశమున కలంకారమును, మంచిహృదయముగలవాఁడును, స్తంభములవంటి బాహువులుగలవాఁడును, డాంభికతలేని విజయముయొక్క కుంభనగలవాఁడును, మహావీరుఁడును, పండితుఁడును, శౌ ధైర్యముగలవాఁడును, దశరథునికుమారుఁడును, అంతటను ప్రకాశించుచున్న మంచిగుణముల యుద్యానవనమయినవాఁడును, దశాననుని చంపినవాఁడును అగు శ్రీరామునియందు విహరించుచుండును గాక.

శ్లో. గతేష్వనేకేషు భవేషు పాపప్రతేష్వపూర్ణేషు చ యోగతీర్థైః,
విత్తస్థసర్వాఘనృణాం కుతోనో జాయతే భక్తిరనంతమూర్తే ౯౫

మ. అలయోగవ్రతతీర్థయాత్రరహితం ♦ బై కల్మషాసక్తులై
యిల జన్మంబు లనేకముల్ జరిగ నే ♦ నేకాలముం రాఘవుం
దలఁపం జేరకపోతి నిద్దయునఁ ద♦ద్దాసానుదాసుండనై
కొలుతుం శ్రీరఘురామచంద్రుని మదిం ♦ గోర్కుల్ ఫలింపన్వెసన్.

తా. యోగాభ్యాసములచేతను, తీర్థక్షేత్రయాత్రలచేతను పూర్ణములు గాని వియు, పాపములయిన ప్రతములు గలవియు నగు పెక్కుజన్మములు గలించిన నను చుండినఁగాని, భయపడినసర్వపాపములును గలమనుజులకుఁ గులస్థితముగు నేరాముని యందు భక్తి గలుగదో, అనంతుఁడయిన అట్టిరాముని స్తుతించెదను.

శ్లో. శ్రీరామభద్రాశ్రితయోగివర్యపాదాబ్జయుగ్మం సతతం భజేహమ్,
యచ్ఛ్రుత్యుపీధామమనప్రవేశే తచ్ఛ్రుత్యుపీ పశ్యతి యస్య చేతః. ౯౬

ఉ. శ్రీరఘురాముపాదసర♦సీజము లెవ్వఁడు నాశ్రయించు న
త్యూహరుము లైనయోగిజన♦పుంజపదంబులు గొల్చి యా శ్రీరా

ధారుని దీప్తిధామము స♦దా పరికింపుదు రెట్టిచూపుచే
నారయుచుందు నాహృదయ♦మందు నిరంతర మట్టిచూపునన్.

తా. ఎవరి నేత్రములు తేజస్సుచేతను సాంద్రుఁడయిన రాముని యందుఁ బ్రకాశకములగలవి యగునో, వారి నేత్రముల నెవని మనస్సు చూచుచుండునో, అట్టి శ్రీరామభద్రుని కాశ్రితులయిన యోగిశ్రేష్ఠుల యొక్క పాదపద్మములఁ జెంతను నేను సదా భజించెదను.

శ్లో. నగ్రస్త స్తమసా న చాహ్ని మలినో దర్శేన నో కర్శితో
నైవాస్తంగతవాన్ న చాంకితతను ర్నో పాక్షికశ్రీరపి,
లోకాలోకనగేంద్రలంఘనవిధౌ నో పంగుభావం గతో
నిర్దోషో గుణసాగరాద్రఘుపతే ర్జాతో యశశ్చంద్రమాః. ౯౯

మ. ఒకపక్షంబుననే ప్రకాశిలఁడు రా♦హుగ్రస్తుఁడుం గాఁడు ద
ర్శ కృశింపండు కళంకముల్ గనఁ డెటుల్ ♦ రాణల్ బగల్ దీప్తిపో
వక యుండున్ వరచక్రవాళ మెగురన్ ♦ బంగుండు గాఁ డస్తమిం
పక యుండున్ గుణవార్ధి రామభవకుం♦భకీర్తిచంద్రుం డగున్.

తా. రఘువంశప్రభువయిన శ్రీరాముని యొక్క గుణములనెడి సముద్రమునుండి పుట్టినవాఁ డగు కీర్తిచంద్రుఁడు, రాహువుచేతను మ్రింగఁబడఁడు. పగటిపూట, మాలిన్యమును పొందఁడు. అమావాస్యచేతను కృశింపఁజేయఁబడఁడు. అస్తమయమును పొందువాఁడు గాఁడు. కళంకితమయిన శరీరముగలవాఁడు కాఁడు. ఒక పక్షము నందే కలుగుశోభగలవాఁడును గాఁడు. చక్రవాళపర్వతములను, దాఁటునప్పుడును కుంటితనమును పొందఁడు. ఏవిధమయిన దోషమును లేనివాఁడు. (సామాన్యసముద్రమునుండి పుట్టినచంద్రుఁడో—రాహుగ్రస్తుఁ డగుచుండును, దివామలినుఁడు, దర్శకర్శితుఁడు, అస్తమయమును పొందువాఁడు, కళంకితశరీరుఁడు, ఏకపక్షశ్రీకుఁడు, చక్రవాళలంఘనపంగుఁడు, సదోషుఁడును అనుట.)

శ్లో. నాగానా మయుతం తురంగనియుతం సార్ధం రథానాం శతం
పాదాతా శ్శతకోటి యుద్ధవలితా నృత్యత్కబంధే రణే,
ఏవం కోటిసహస్రసత్రవిధా చంచద్బలద్ఘంటికో
యామార్ధం పరమాత్మనో రఘుపతేః కోదండఘంటారవః. ౧౦౦

మ. అలరన్ వేయుగజంబులున్ దశసహ♦స్రాశ్వంబులున్ స్యందనం
బులు నూటేఁబదినూఱుకోట్లసుభటుల్ ♦ భూమిం బడన్ దట్టమై
నలి నర్తంచరకోటి వేలు వరుసన్ ♦ నర్తింప శ్రీరాముచే
విలుఘంటారవ మొప్పునట్లు మొరసెన్ ♦ విఖ్యాతియామార్ధమున్.

తా. పదివేలు-ఏనుఁగులును, నియమితసంఖ్యగల గుఱ్ఱములును, నూఁటయేఁబది రథములును, నాలుఁగోట్లు కాలిబంట్లును యుద్ధమునందు చావఁగా, ఒక మొండెము ఆడును. ఈప్రకారముగా కోటివేలు మొండెములు నాట్యమాడినప్పుడు ధనుస్సునందుఁ గట్టఁబడినగంట ఒక్కసారి మ్రోఁగును. అంతయుద్ధములో పరమాత్మస్వరూపుఁడైన రాముని ధనుస్సునకుఁ గట్టఁబడిన ఘంటచప్పుడు ఒక్క-అరజాము జరిగినది.

శ్లో. భజేఽహం సదా రామ మిందీవరాభం
భవారణ్యదావానలాభాభిధేయమ్,
భవానీహృదా భావితానందరూపం
భవాభావహేతుం భవానీప్రసన్నమ్. ౧౦౧

మ. కలుషారణ్యదవానలాహ్వయు నుమాకాంతాత్మసంభావిలో
జ్జ్వలసాక్షాత్కరు నుత్పలాభుని భవాభావాదిహేతుఁ విని
ర్మలు నానందమయుఁ శ్రితార్తిహరు సన్మాణిక్యభూషుఁ దినే
ట్కులవార్ధీందుని రామచంద్రు మదిఁ గోర్కుల్దీర భావించెదన్.

తా. నల్లఁగలువవంటి కాంతిగలవాఁడును, సంసారమనెడి యరణ్యమునకు దావాగ్నితో సమానమయిన నామముగలవాఁడును, పార్వతిహృదయముచేతను భావింపఁబడు-ఆనందమే స్వరూపముగాఁ గలవాఁడును, సృష్టికిని నాశమునకును కారణమును, పార్వతికిఁ బ్రసన్నుఁడయినవాఁడును అగురాముని నే నెప్పుడును భజించుచుందును.

శ్లో. సురానీకదుఃఖౌఘనాశైకహేతుం
నరాకారదేహం నిరాకార మీడ్యమ్,
పరేశం పరానందరూపం వరేణ్యం
హరిం రామ మీశం భజే భారనాశమ్. ౧౦౨

మ. ధరణీభారనివారణుఁ దివిజసంతానార్తివిచ్ఛేదనుఁ
హరి మాయామనుజాకృతిఁ బరుఁ బరానందస్వరూపుఁ బరా
త్పరు రూపాహ్వయశూన్యుఁ గేవలపరంధాముఁ వరేణ్యుఁ బరే
శ్వరునిఁ శ్రీరఘురామభద్రు మది సంభావించి సేవించెదన్.

తా. దేవసమూహముయొక్క దుఃఖసమూహమును నశింపఁజేయుటకు ముఖ్యకారణమును, నరునియాకారమువంటియాకారముగలదేహము గలవాఁడును, ఆకారము లేనివాఁడును, స్తుతిచేయఁదగినవాఁడును, పరమేశ్వరుఁడును, పరమానందస్వరూపుఁడును, శ్రేష్ఠుఁడును, విష్ణుస్వరూపుఁడును, ప్రభువును, భూభారమును నశింపఁజేసినవాఁడును అగురాముని భజించుచుందును.

శ్లో. ప్రపన్నాఖిలానందదోహం ప్రసన్నం
ప్రపన్నార్తినిశ్శేషనాశాభిధానమ్,
తపోయోగయోగీశభావాభిభావ్యం
కపీశాదిమిత్రం భజే రామచంద్రమ్. ౧౦౩

మ. సుజనార్తిఘ్నసమాహ్వయుఁ మునిజనస్తోమార్చితుఁ యోగిరా
డ్విభవధ్యానితు సుప్రసన్ను శ్రితవత్సల్యశీలానందు నం
బుజమిత్రాత్మజముఖ్య వానరసఖుఁ భూపుత్రికాధీశ్వరుఁ
భజియింతుఁ నిరతంబు రాఘవపరబ్రహ్మంబు నిష్టార్థికిన్.

తా. తనయందుఁ బ్రపత్తిని చేసినవారి కందఱికిని, ఆనందమును ఇచ్చువిధ మునఁ బ్రసన్నుఁడును, ప్రపన్నులయినవారిబాధలను నిశ్శేషముగా నశింపఁజేయు పేరుగలవాఁడును, తపోయోగముగల యోగీశ్వరుల భావములయందు భావనచేయఁ దగినవాఁడును, సుగ్రీవాదులకు స్నేహితుఁడును, అగురామచంద్రుని సేవింతును.

శ్లో. స్ఫురద్రత్నకేయూరహారాభిరామం
ధరాభారభూతాసురానీకదావమ్,
శరచ్చంద్రవక్త్రం లసత్పద్మనేత్రం
దురాసాద్యపాదం భజే రామచంద్రమ్. ౧౦౪

మ. వనజాతాయతనేత్రుఁ జంద్రవిలసద్వక్త్రుం దురాసాద్యపా
దుని ధాత్రీతలభారదైత్యగణనిర్ధూతాగ్నిసాదృశ్యుఁ గాం
చనమాణిక్యకిరీటకంకణవిరాజత్కుండలాలంకృతున్
ఘనవర్ణున్ రఘురామభూభుజునిఁ గాంతుం గొల్తు నశ్రాంతమున్.

తా. ప్రకాశించురత్నములుగల భుజకీర్తులచేతను, హారములచేతను మనోహరుఁడును, భూభారభూతులయినరాక్షసులకు దవాగ్నివంటివాఁడును, శరత్కాలచంద్రునివంటి మొగముగలవాఁడును, ప్రకాశించుపద్మములవంటి కన్నులుగలవాఁడును, పొందుటకు శక్యముగానిపాదములు గలవాఁడును, అగురామచంద్రుని సేవించెదను

శ్లో. సురాధీశనీలాభ్రనీలాంగకాంతిం విరాధాదిరక్షోగణానీకనాశమ్.
కిరీటాదిశోభం పురారాతిలాభం భజే రామచన్ద్రం రఘూణామధీశమ్,

చ. సురవరనీలరత్నరుచిశోభితగాత్రు విరాధముఖ్యము
ఖ్యరదనుజాంధకారహృతిసారసమిత్రుఁ బురారిసఖ్యుఁ గ
ర్బురమకుటాద్యలంకరణుఁ బుష్కరరత్నకులాబ్ధిచంద్రు శ్రీ
కరు రఘురామభద్రు మదిఁ గాంక్షలు దీర భజింతు నిత్యమున్

తా. ఇంద్రనీలములవంటి మేఘమువంటి నల్లనిశరీరకాంతి గలవాఁడును, విరాధుఁడు మొదలయినరాక్షసుల సంఘములసమూహమును నశింపఁజేసినవాఁడును, కిరీటాదులశోభ గలవాఁడును, ఈశ్వరునకు లాభస్వరూపుఁడును, రఘువంశపురాజులకుఁ బ్రభువును అగు శ్రీరామచంద్రుని సేవించెదను.

శ్లో. లసచ్చంద్రకోటిప్రకాశాదిపీఠేసమాసీనమంకేసమాధాయసీతామ్,
స్ఫురద్ధేమవర్ణాంతటిత్పుంజభాసాంభజేరామచన్ద్రంనివృత్తార్తితన్ద్రమ్

మ. ఘనజాంబూనదపద్మశోభితుని రాకాచంద్రకోటిప్రభా
సనసందీపితు వామభాగధరణీజాతాసమాయుక్తు రా
ముని నీలోత్పలనీలనీరదలసన్మూర్తిన్ నివృత్తార్తితం
ద్రుని గాకుత్స్థకులాబ్ధిచంద్రు భజియింతున్ నామనస్సిద్ధికిన్. ౧౦౬

తా. ప్రకాశించుచున్న కోటిచంద్రులవెలుఁగుగల-ఆదిపీఠమునందు, పుటము వేసినబంగారమువంటి శరీరకాంతిగలదియు, మెఱపులసమూహముయొక్క కాంతి వంటికాంతిగలదియు నగుసీతను తొడపై నుంచుకొని కూర్చున్నవాఁడును, నివర్తించినపీడలు, ఆలస్యము గలవాఁడును అగురామచంద్రుని సేవించెదను.

శ్లో. సదా భోగభాజాం సుదూరే వసంతం
సదా యోగభాజా మదూరే విభాన్తమ్,
చిదానందకందం సదా రాఘవేశం
విదేహాత్మజానందకందం ప్రపద్యే. ౧౦౭

మ. తతభోగానువిహారచిత్తులకుఁ బొందన్ దూరమై భక్తిసం
యుతయోగీంద్రుల కెల్లఁ దాపగుచు వేద్యుండై చిదానందుఁడై
క్షితిపుత్రీహృదయప్రమోదకరుఁడై చెల్వొందు శ్రీరామునిన్
సతతంబున్ శరణంబు వేఁడెదను మోక్షశ్రీసమాకాంక్షినై.

తా. ఎల్లప్పుడును భోగముల ననుభవించువారికి మిక్కిలి దూరమునం దుండువాఁడును, ఎల్లప్పుడును యోగ మనఁగాఁ జిత్తవృత్తులను నిరోధించి స్వాధీనమునం దుంచుకొన్నవారికి సమీపములోఁ బ్రకాశించువాఁడును, చిదానందములకుఁ గందమును, జనకరాజుకూఁతురైన సీతయొక్క-ఆనందమునకు బీజమును, రఘువంశరాజులకుఁ బ్రభువును అగు శ్రీరామునిగూర్చి సదా ప్రపత్తిని చేయుచుందును.

శ్లో. మహాయోగమాయావిశేషానుయుక్తోవిభాసీశలీలానరాకారవృత్తిః
త్వదానందలీలాకథాపూర్ణకర్ణాస్సదానందరూపాభవంతీహలోకే.

మ. లలితంబై నభవత్కథామృతము చాలం గ్రోలుచున్నట్టిని
శ్చలులానందమనస్కులౌట కరయన్ సందేహమా భక్తవ

త్సల లీలామనుజాకృతిప్రకృతియో♦షాయుక్త కాకుత్స్థవం
శిలసద్వార్ధిశశాంక రామధరణీ♦శా దేవదేవోత్తమా. ౧౦౮

తా. ప్రభూ! రామా! నీవు గొప్పదియగు యోగమాయాసంబంధములయిన విశేషములతోఁగూడుకొన్నవాఁడవు గనుకనే లీలచేతనైన మనుష్యాకారముచేతను ప్రవర్తించినవాఁడ వగుచుఁ బ్రకాశించుచున్నావు. ఆనందకరములయిన నీలీలలను గుణించినకథలచేతను నిండింపఁబడిన చెవులుగలవారు—అనఁగా సదా నీకథలు వినువారు, ఎల్లప్పుడును, ఈలోకమునందు, ఆనందస్వరూపు లగుచుందురు.

శ్లో. యస్య ప్రాణనివారణావనకృతే స్యాతాం నిదానే విభో
ర్వైరం ద్రేర్ధ్వాంక్షపతేః కృపాజలనిధేః కోపప్రసాదా ముదే,
భూయా ద్వాసవనీలసన్నిభతను ర్వామాంకసీదద్వధూ
స్సోఽయం దుష్టనిశాటపాటనపటు శ్శ్రీరాఘవో వ స్సదా. ౧౦౯

మ. పతిప్రాణావనశిక్షహేతు వయి కో♦పధ్వంసిసంబంధగ
ర్వితకాకాసురునందుఁ గ్రోధి యయి య♦ర్థింపన్ బ్రసాదాత్ముఁ డై
శితమన్యూపలవర్ణుఁ డై సదయుఁ డై ♦ స్త్రీపుత్రికాయుక్తుఁ డై
హతదుష్టాసురుఁ డైనరాఘవుఁడు న♦న్నశ్రాంతముం బ్రోవుతన్.

తా. దయాసముద్రుఁడయిన యేప్రభువుయొక్క కోపము, అనుగ్రహము, వాలియొక్కయు, కాకాసురునియొక్కయు, ప్రాణములను హరించుటకొఱకును, రక్షించుకొఱకును కారణముగ నయినవో, ఆయాప్రభువు, ఇంద్రనీలముతో సమానమయినశరీరముగలవాఁడు- ఎడమతొడపైని కూర్చున్నసీతాభామగలవాఁడు, దుష్టులయిన రాక్షసులను చంపుటయందు సమర్థుఁడు, శ్రీరఘువంశోద్భవుఁడు, శ్రీరాముఁడు సదా మీకు సంతోషముకొఱ కగుఁగాక.

శ్లో. దుష్టో వా కలుషాత్మకోఽపి పిశునో దుర్మార్గసంచారవాన్
మాతృఘ్నోఽపి పితృఘ్నవర్త్మనిరత స్సన్మానినిందాపరః,
యోఽదః శ్రీత్యమృతం హితం మధురసం వక్తా చ శ్రోతా లిఖన్
స ప్రాప్నోతి నిరంతరైహికసుఖం నిర్వాణసౌఖ్యం తతః. ౧౧౦

మ. కలుషాత్ముండును మాతృతాతహుఁడు దు♦ష్కర్ముండునున్ మానివ
ర్యుల నిందించునతండు దుష్టుఁడు మహా♦క్రోధాంధుఁడైనన్ దినేట్
కులకర్ణామృతమున్ లిఖింప శ్రుతులన్ ♦ గ్రోలన్ బఠింపన్ మహిన్
గలకాలంబు సుఖంబులం గని మహా♦నందంబు నొందున్ దుదిన్.

తా. దుష్టుఁ డయినప్పటికిని, కలుషమయిన చిత్తముగలవాఁ డయినప్పటికిని, కొండెములు చెప్పి కొంపలు కొల్చువాఁ డయినప్పటికిని, చెడుమార్గములయందు

సంహరించువాఁ డయినప్పటికిని, తల్లిని చంపినవాఁ డయినప్పటికిని, తండ్రిని చంపు వారిమార్గమునం దాసక్తుఁ డయినప్పటికిని, పండితులను మునీశ్వరులను నిందించుట యం దాసక్తుఁ డయినప్పటికిని, ఎవఁడు తియ్యనిరుచిగలదియు, మేలుచేయునదియు అగునీ శ్రీరామకర్ణామృతమును పఠించునో, వినునో, వ్రాయునో అతఁడు, ఎడతెరపి లేనియిహలోకసుఖములను పొందుటయేకాక, దేహాంతమున మోక్షసుఖమును గూడఁ బొందుచున్నాఁడు.

మాలిని. రఘుకులవరనాథో జానకీప్రాణనాథః
పితృవచనవిధాతా కీశరాజ్యప్రదాతా,
నిశిచరపతినాశః ప్రాప్తరాజ్యప్రవేశో
విహితభువనరక్షః పాతు పద్మాయతాక్షః. ౧౧౧

*చ. రవికులవార్ధిచంద్రుఁడు, ధరాతనయామనస్సదయేశ్వరుండు, తా
తవచనకారి, సౌరికి ముదంబుగ రాజ్య మొసంగినాతఁడున్
దివిజవిరోధిరాఘుని వధించి యయోధ్యఁ గృతాభిషేకుఁడై
యవనిని బ్రోచినట్టి కమలాక్షుఁడు రాముఁడు మమ్ము నోముతన్.

తా. రఘుమహారాజువంశమునందు శ్రేష్ఠుఁడయిన ప్రభువును, సీతప్రాణనాథుఁడును, తండ్రియగు దశరథమహారాజుయొక్క మాటను నెఱవేర్చినవాఁడును, సుగ్రీవునికి వానరరాజ్యము నిచ్చినవాఁడును, రాక్షసులకుఁ బ్రభువైన రావణుని నశింపఁజేసినవాఁడును, పొందఁబడిన రాజ్యప్రవేశము గలవాఁడును, అనఁగా రాజ్యమునఁ బ్రవేశించినవాఁడును, చేయఁబడిన లోకరక్షణ గలవాఁడును, అనఁగా లోకములను రక్షించినవాఁడును, తామరరేకులవలెనే విశాలములయిన కన్నులుగలవాఁడును అగుశ్రీరాముఁడు మమ్మును రక్షించుఁగాక.

మ. శివసామ్యుం డగు నాదిశంకరులు ముక్తి శ్రీరామకర్ణామృతం
బవనిన్ సంస్కృత మేర్పరించె నది మోక్షాపేక్షఁ జేకూరి వం
శవరాబ్ధిందు ప్రసిద్ధసిద్ధకవి నే శ్రద్ధన్ దెలింగించి రా
ఘువ! పూదండగ నిచ్చినాఁడఁ గొను మాకల్పంబుగా సత్కృపన్.

మ. ఇది శ్రీరామపదారవిందమకరందేచ్ఛాత్తసన్మత్తష
ట్పదవిజ్ఞానపథాబ్జరేణుపటలీప్రాప్తోత్తమాంగోల్లస
న్ముదితాంతఃకరణుండు సిద్ధకవి మా[illegible]మావనీ
శదయాలోకనఁ జెప్పె నాలుగ[illegible]శ్వాసం [illegible]ప్తికిన్.

శ్రీరామకర్ణామృత[illegible] సమాప్తము.




* ఈ పద్యము పురాణం - సూ[illegible]నారాయణతీర్థులు వ్రాసినది.